'పాపాయి నేలనా కెందరి కళ్లు

పల్చని గంజ లే కెందరికో
పట్టులతో పని చావమంటావా'?

లిమిటెడ్ వారి

# ద్రోహి

డైరెక్షన్
ప్రసాద్

సినేరియో
తాపి

స్టుడియో
శోభనాచల



నటీనటులు
రాజ్యం వరలక్ష్మి
ప్రసాద్
ప్రకాశరావు
ప్రభాకరరావు
రాళ్ళభండి
శివరావు

వివరాలకు:
స్వతంత్ర ఫిలిమ్సు లిమిటెడ్ :: మద్రాసు 17

ఆంధ్ర & రాయలసీమ డిస్ట్రిబ్యూటర్సు:
ప్రీమియర్ ఫిలిమ్సు లిమిటెడ్ :: బెజవాడ

# అభ్యుదయ

## సచిత్ర సాహిత్య మాసపత్రిక

సంపుటి ౧ సంచిక ౨

జూన్, 1947

సంపాదకులు :

చదలవాడ పిచ్చయ్య

కొమఱ్ఱాజు వినాయకరావు ప్రయాగ కోదండరామశాస్త్రి

# విషయసూచిక



---

# శ్రీ వీరేశలింగం వర్ధంతి

నవీనాంధ్ర సంస్కృతీ యుగపురుషులైన శ్రీ కందుకూరి వీరేశలింగంగారి వర్ధంతి సభలు మే 27 వ తేదీన ఆంధ్రదేశమంతటా జరిగాయి. అభ్యుదయ రచయితలూ, తదితర సాహితీపరులూ, కళాకారులూ, యువకులూ, మహిళలూ ఈ వర్ధంతి సభలలో పాల్గొన్నారు. బొంబాయి, పిఠాపురం, గుంటూరు, కొలకలూరు, రాజవోలు, రాజమండ్రి, వెల్దిపాడు మొదలైన ప్రదేశాల్లో సభలు జరిగాయి సభా విశేషాలూ, ఉపన్యాస పూర్తిపాఠాలూ, వివరంగ్గా మా కార్యాలయానికి చేరక పోవడంవల్ల ఈ వర్ధంతినిగూర్చి ప్రత్యేక వ్యాసాన్ని ప్రకటించలేక పోతున్నాం.

## అభ్యుదయ ప్రజాకవి నాజరు

అందరూ జీవిస్తారు, కాని చాలామందికి జీవితం ఉండదు—అసలు జీవితమంటే ఏమిటోకూడా తెలియదు. ఏ జీవితానుభవమూ లేకుండానే వాళ్ళ రోజులు జరిగిపోతుంటాయి కాని. నాజరు అన్నివిధాలా జీవితానుభవాలను జీర్ణించుకొన్న నిజమైన జీవితం కలవాడు. నిత్యం చెమటోడ్చి కష్టించినా కడుపునిండని కూలీగా బయలుదేరి, మానవహృదయంలోని అగాధ బాధలనూ ఉన్నత భావాల్ననూ ప్రతిబింబించే కళావేత్తగా తన జీవితాన్ని నిర్మించుకొన్నవ్యక్తి.

నాజరు, గుంటూరుజిల్లా పొన్నెకల్లు గ్రామంలో ఒకపేద ముస్లిం కుటుంబంలో జన్మించాడు. తండ్రి రైతు. సన్నాయి వాయించి పెద్దలుసంపాదించిన కాసంత కొంగ్ర, ఫలసాయానికి పనికిరాకపోయినా, చాకిరీకి మాత్రం వుండేది. నిజానికి, పాలికూలికి పోవడం తప్పేదికాదు గాని, సెంటుపొలమున్నా రైతు రైతే కనుక, నాజరు తండ్రి కూలీ మాత్రం కాదు. చేతిలో దమ్మిడీ లేకపోయినా, తన కొడుకు పెద్దపెద్ద చదువులు చదివి ఊళ్ళేలాలి. తనతోటి—పెద్దరైతులతో పోటీ, తనబిడ్డ వాళ్ళబిడ్డల కంటె తీసిపోకూడదు. "పుత్రోత్సాహము తండ్రికి పుత్రుడు జన్మించినపుడె పుట్టదు" అన్న పద్యం ఆయనకు హృత్కవిలె. అదీ కాక, తన బిడ్డకు ఎంత ముద్దుగా అన్నగారి పేరు పెట్టుకొన్నాడు! సన్నాయి వాయిద్యంలో అంత ప్రఖ్యాతిపొందిన ఆయన పేరు నిలుపుతాడా? లేదా? కొడుకు—అవి అనుక్షణమూ అనుమానమే,

నాజరు పెద్ద విద్వాంసుడుకావాలని తండ్రి పొన్నెకల్లు ఎలిమెంటరీ స్కూల్లో నాలుగో క్లాసుదాకా చదివించాడు. ఆ స్కూల్లోనయినా, పేరుకు ఉచితంగానే చదువు చెప్పేవారుగాని, అసలు చదువు రావాలంటే, పంతులుగారి ఇంటి గోడకు ఉచితంగా మన్ను తోలిపెట్టాలిసిందే! ఏమైనా, నాజరు నాలుగో క్లాసుదాకా నెట్టుకొచ్చాడు. ఇన్‌స్పెక్టరు వచ్చేసరికి, పంతులుగారికి కళాభిమానం పుట్టుకొచ్చి, పిల్లలచేత నాటకాలాడించాడు, నాటకాలకు వచ్చిన హార్మోనిస్టు రంగంమీద నాజరునుచూసి, తెనాలి తీసుకెళ్ళి, బాలరత్నసభలో చేర్చాడు. అంతటితో, నాజరు 'గోపి'గా మారిపోయి, రామదాసు నాటకంలో కబీరై, ఇతరత్రా ఆడవేషాలుకూడా వేశాడు.

ఎన్ని వేషాలు వేసినా, ప్రేక్షకులిచ్చే బహుమతులుమాత్రం కంపెనీకిపోయి, నాజరుకు 15 రూపాయలు నెలకోసారి కళ్ళబడేవి. అవైనా, ఊరికే

వస్తాయా? మొత్తానికి ఇది బాగానేవుంది, ఒకవైపు సంగీతం సాధికవుతున్నది; రెండోవైపు భుక్తికి గడుస్తున్నది.

కాని, అనుకున్నన్నాళ్ళు పట్టలేదు బాలరత్నసభ, అప్పటి తక్కిన అన్ని నాటకం కంపెనీల్లాగానే, తన అధ్యాయం ముగించుకొన్నది.

నాజరు జీవితంలో మళ్ళీ ఒక కొత్తఅధ్యాయం. కడుపుకట్టుకొని తండ్రి నెలకు మూడురూపాయలు పంపిస్తుంటే, నరసరావుపేటలో సంగీతపాఠం. అది మాత్రం ఎంతకాలం? ఒకనాడు తండ్రి పంతులుగార్ని దర్శించుకొని. "ఇకనేను డబ్బు పంపలేను. పిల్లవాణ్ణి ఇంటికి తీసుకుపోతాను" అన్నప్పుడే నాజరు సంగీతం సాంతం కావలసింది. కాని, ఆపంతులుగారు అన్నంపెట్టి విద్య నేర్పుతానన్నాడు. ఆసంతోషం ఇంకా అనుభవం కాకమునుపే, తండ్రిగారు మరణించడంతో, నాజరు ఇల్లుచేరవలసి వచ్చింది.

ఇల్లు గడిచే దారిలేదు. బాధ్యత తనమీదేవుంది. తల్లిని ఒంటిగా వదలి పెట్టడంగాక, చెల్లినికూడా ఆమెకు బరువుపెట్టి, ఎక్కడికి పోతాడు? ఇంకా చదువేమిటి?

కాని, తల్లి ఒప్పుకోలేదు. "నాబ్రతుకు నేను చూసుకుంటాను. నీవుపోయి చదువుకుంటావా? లేదా?" అని పట్టుపట్టింది. దగ్గర్లోవున్న తాడికొండలో ఎవరో సంగీతం చెబుతారంటే అక్కడికెళ్ళాడు. తిండిఎట్లా? తురకపిల్లవాడికి వారాలు ఎవరిస్తారు? జోలికట్టి. కట్టిన గడపల్లాఎక్కి, చదువు సాగించాడు.

అయితే, జీవితంలోఉన్న తమాషా ఏమంటే ఎలాంటివాళ్ళకు అలాంటి వాళ్లే దొరుకుతారు. నాజరుకు సరీగా తనలాంటి విద్యార్థే ఒకడుతోడు దొరికాడు. కాని వాడికి బిచ్చమెత్తుకోడమంటే నామర్దా. అదీకాక, ఒకడితో అయ్యేపని ఇద్ద రెందుకు చెయ్యాలి? ఎలాగూ నాజరు బిచ్చమెత్తుతున్నాడుగా! అందులోనే నాలుగు మెతుకులు....

ఇదీ తిన్నగా సాగిందికాదు, నాజరుకు తల్లిజీవితాన్ని గూర్చిన దిగులు ఎక్కువయింది. తాను సంగీతం నేర్చుకుంటున్న మాటయితే నిజమేకాని, తల్లిని ఏంచేసి వచ్చినట్లు? ఇది ధర్మంకాదనుకున్నాడు. సంగీతానికొక సలాంకొట్టి, ఇంటికెళ్ళి, ఎక్కడో తలతాకట్టుపెట్టి రెండుదున్నల్నికొని మోజుగా వ్యవసాయం పెట్టి, మోపెడు అప్పులతో తయారై, కూలి జీవితానికి తలొగ్గాడు రైతుబిడ్డ.

కోతలకు పోతే రోజుకారణాల డబ్బులు వచ్చేమాట నిజమే. కాని సంవత్సరం పొడుగూతా ఏంకోస్తాడు? లాభంలేదు. పోగాకు కంపెనీ మురాకూలీలలో చేరాడు. తీరానెలఅయ్యేసరిక్కిలెక్కప్రకారం జీతం అడిగితే, "ఇలాంటి ఉప్పలాయి ఇంతవరకూ లేదు. నీవెక్కడినుంచి వచ్చా?"వని యజమానులు ఇంటిత్రోవ చూపారు.

ఏంచేస్తాడు ? ఇంటికెళ్ళి ఉన్నదున్నను కాస్తా అమ్మేసి, కుట్టుమిషన్ కొన్నాడు. కాని అతనికి కుట్టడం తెలియదు. ఆ కుట్టించుకునేవాళ్ళకుకూడా అసలు కుట్టడమంటే ఎలావుంటుందో తెలియదు. ఎలాగైనా సరే, రెండు గుడ్డముక్కలను దారంతో బంధించడమే కుట్టడం క్రింద లెక్క. ఈ పని బాగానేసాగింది. సంవత్స రంలో చాలాపైకం పోగయింది - రెండువందలంటే, ఏం సామాన్యమా ? ఇంత డబ్బుచూసి, ఊరుకోబుద్ధి పుట్టక పెళ్ళి చేసుకున్నాడు.

అప్పుడప్పుడూ గారపాడు అత్తవారింటికి వెళ్ళి, సంగీతాలు తీస్తుంటే, చూసినవాళ్లు ఊరుకోక, నాటకాలు నేర్పమని వెంటబడ్డారు. ఇది మంచివృత్తిగానే తోచింది. సంపాదనకూడా నెలకు ముప్పైనుంచి ముప్పాతికదాకా పెరిగిపోయింది. జీవితంలో ఒడిదుడుకులు తగ్గి, శాంతంగా ఆలోచన ఆరంభమయింది.

చుట్టూ దేశంలో అనేక సంఘటనలు జరుగుతున్నాయి. ఎక్కడచూసినా స్వాతంత్ర్యనినాదాలు — అనేక త్యాగాలు — లాఠీలు—జైళ్ళు — ఉరికంబాలూ—ఇంకా అంతకంతకూ తెగించి, పెచ్చుపెరిగి ముందుకు నడుస్తున్న విప్లవయోధులూ - ఈదృశ్యమంతా ఒక్కసారి దృష్టిపథంలో పడ్డది. కూలీలూ, రైతులూ తమహక్కుల కోసం పోరాటాలు సాగిస్తున్నారు కొత్త చైతన్యంతో మన స్వాతంత్ర్యోద్యమంలో కాంతివెల్లువలు ప్రసరిస్తున్నారు. 'చూడలేని పాపిష్టి తుపాను' లాగా, బ్రిటిష్ ప్రభుత్వం కమ్యూనిస్టులమీద కత్తిగట్టింది. ఎక్కడ దొరికినవాణ్ణి అక్కడ పట్టుకోవాలని ప్రభుత్వం ప్లాను. కాని ఎక్కడా ఎవ్వరూ దొరకరు; దొరికినా, పట్టుకున్నవాడికి ప్రహరణాలు దొరకడం తప్పితే, ప్రభుత్వం చేతిలోపడే వాళ్ళు ఎవ్వరూలేరు. అన్నీ వీరగాథలు - 1941 దాకా నాజరు హృదయంలో ఇవన్నీ ఎన్నెన్ని ఊహలనో రేకెత్తించాయి.

ఎక్కడో రష్యాదేశంలో కూలీలూ, రైతులూ రాజ్యమేలుతున్నారట. అక్కడ అందరూ కష్టపడే జీవిస్తారట. సోమరిపోతులూ దోపిడీదొంగలూ లేరట. ఎంత ఆశ ! మనదేశంకూడా అలా అయితే, తనవంటి పేదలకు ఎన్ని అవకాశాలు ! ఎంత లాభం !

గోర్కీ వ్రాసిన 'అమ్మ'' అనే నవల చదువుతుంటే, ఇంట్లో అమ్మకు భయం. పోలీసులు వస్తారని గోల. కాని, గోర్కీ నవలలోని పావెల్‌ను చూస్తుంటే, తన సంగతి గోర్కీ ఎలా తెలుసుకున్నాడా అనిపించేది నాజరుకు. తన అమ్మకూడా పావెల్ అమ్మలాగా..........

1942 లో కమ్యూనిస్టుపార్టీమీది నిషేధం పోవడంతో, నాజరుకు పార్టీతో ప్రత్యక్ష సంబంధం ఏర్పడ్డది. ప్రజానాట్యమండలివారి ప్రదర్శనాలు చూశాడు.

ఏదో వింతగా ఉంది. లోగడ తానెన్నో నాటకాలు ఆడాడు; ఆడించాడు గదా ! వాటిలో ఎన్నడయినా తన జీవితంగానీ, తనవంటివాళ్ళ జీవితంగానీ, తెర

వెనుకనైనా కన్పించిన పాపానపోలేదే—ఇవాళ తన కళ్ళఎదుట ప్రజానాట్య మండలివారు తన, తనవంటివారి జీవితాలను తెచ్చి నాటకాలక్రింద ప్రదర్శిస్తుంటే, నాజరుకు ఎంత అద్భుతమూ. ఆశ్చర్యమూ కలిగాయో, అంత ఆనందమూ, ఆత్మీయతా కూడా కలిగాయి. వివిధ కళారూపాలను ప్రదర్శించవలసింది విలాసంకోసం కాదనీ, మానవ జీవితాభ్యుదయం కోసమనీ గ్రహించాడు. ప్రజానాట్యమండలి వారి ఉత్తమ కళాసందేశాన్ని అందుకొన్నాడు. తన కళాకౌశలాన్ని ప్రజావిజ్ఞానాభివృద్ధికి వినియోగించాలని దీక్షబూనాడు. ప్రజానాట్యమండలి ప్రదర్శనాల్లో పాల్గొంటూ బుర్రకథలు చెప్పనారంభించాడు.

ఆ పుంస్కోకిల కంఠంలోని శ్రుతులు, ఒక కాంతి ప్రసరణంలా, ప్రజాహృదయాన్ని తన్మయపరిచాయి. ప్రక్కన ముక్కామల పురుషోత్తం తన కథకు వ్యాఖ్యానంచేస్తుంటేనూ, రామకోటి హాస్యం చెబుతుంటేనూ—నాజరు ఎప్పటికప్పుడు కొత్తమోసులెత్తే శక్తితో ఉత్తేజంతో లక్షలాది ప్రజనీకానికి, కమ్యూనిష్టు పార్టీనుంచి తా నందుకొన్న స్వాతంత్ర్య సందేశాన్ని అందజేశాడు.

తాను చెప్పేబుర్రకథలన్నీ తన జీవితంలోకే తొంగిచూస్తున్నట్లనిపించేవి. తనకూ అలాంటి జీవితానుభవాలు అనేకం వున్నాయి. తనలాంటి అనుభవాలే ప్రజలందరివీ....అయినప్పుడు తానుగా తన అనుభవాలను, అభిప్రాయాలను వ్యక్తపరచుకోవాలనిపించేది.

అనిపించడానికేం గాని. తీరా అరవైయేళ్ళు వచ్చి చదువుకోక నోట మన్ను కొట్టుకుంటానా- అన్నట్లు, నాలుగో క్లాసు చదువుకొన్న నాజరు ఇవాళ కవిత్వం చెబుతాడా ?

మానవుడి ఆత్మ నిశ్చయంలో ఉన్న శక్తినిగూర్చి అందరం వేదాంతం చెబుతాము. కాని నాజరు దాన్ని ఆచరణలో పెట్టి మరీచూస్తాడు. అతను కష్టజీవి, ఊహాజగత్తులో విహరించి అంతా అబ్బుకున్నట్టు, ఆత్మసంతృప్తి చెందేరకం, 'మేధావి' కాడు. సాహిత్యం చదువ నారంభించాడు. మొదట్లో గొట్టుగాకనబడ్డ విరాటోద్యోగ పర్వాలు (భారతం) క్రమక్రమంగా 'వేమతియ్యనైన' ధోరణిలోకి దిగాయి. ప్రబంధాలు తెలిసినట్లే అనిపించాయి. కృష్ణపక్షం తనజీవితంలోని బాధలనూ విస్పృహా నిరాశలనూ పనిపెట్టుకొని పలకరించి నట్లయి, మరో ప్రపంచానికి మహాప్రస్థానం పలికించాయి.

నేటి కవిలోకంలో నాజరుకూడా తనస్థానం వెతుక్కొన్నాడు. అభ్యుదయ రచయితల్లో ఒకడైనాడు.

మానవుడిలోని పేరాస, నైచ్యం కల్పించిన కరువుకాటకాల్లో ఆహుతైపోతున్న లక్షలాది బెంగాల్ ప్రజల జీవితాన్ని చిత్రిస్తూ 1943 లో 'బెంగాల్

కరువు' బుర్రకథవ్రాసి, ఊరూరాచెప్పి ఆంధ్రప్రజానీకానికి సోదర వంగప్రజలపట్ల వున్న పవిత్ర బాధ్యతను ప్రబోధించాడు. ఆంధ్ర అభ్యుదయ రచయితల అనేక మహాసభల్లో (బెజవాడ, రాజమండ్రి, మద్రాసు) ఈకథచెప్పి, కృష్ణశాస్త్రిగారివంటి కళాకోవిదుల ప్రశంసలకు పాత్రుడైనాడు. కథలో బెంగాల్ జీవితంలోని దుఃఖమయఘట్టాలను నాజరు వర్ణిస్తుంటే, కల్నల్ శంకరశాస్త్రి,డాక్టర్ గోవిందరాజుల సుబ్బారావు గార్లవంటి ప్రేక్షకులు. తాము కథవింటున్న సంగతే మరచి, కరువు బెంగాల్లో జీవిస్తున్న రైతుల్లా కూలీల్లా కన్నీరుకార్వ నారంభించారు. రచయితగాను, గాయకుడుగాను అతను సాధించిన కళా ప్రతిభకు ఇదేచాలు, కొలబద్ద.

తర్వాత, నాజరు "పల్నాటి వీరచరిత్ర"ను కొత్త దృక్పధంతో చిత్రించాడు. పట్టుదలలకోసం, ప్రఖ్యాతులకోసం అన్నదమ్ములు తమలో తాము కొట్లాడుకొని ఎలా అధోగతి పాలయ్యేదీ, ఇవాళటి హిందూ ముస్లిం విభేదాలను దృష్టిలో పెట్టుకొని, వర్ణించి, "పల్నాటి వీరచరిత్ర" నుంచి ఐక్యతా సందేశం ఇచ్చాడు. 1921 శాసన ధిక్కారోద్యమం రోజుల్లో "పల్నాటి హనుమంతు" బ్రిటిష్ ప్రభుత్వం మీద సాగించిన వీరోచిత పోరాటాన్ని చిత్రిస్తూ మరో బుర్రకథ ఈ మధ్యనే పూర్తిచేశాడు.

నిత్యజీవితంలోని అనేక బాధలతో పనుదేరి, కళా జీవితంలో కాకలు దీరిన నాజరు జిజ్ఞాస చల్లారేదికాదు. పట్టుదల పట్టుతప్పేదికాదు. ముందు ముందు ఇంకా ఎన్నో ఉత్తమ రచనలు చేస్తాడు. ఆంధ్ర ప్రజాజీవితంలో తన కళాజ్యోతి చిరకాలం కాంతులు విరజిమ్మాలనే అతని ఆదర్శం సఫలమై తీరుతుంది.

నాజరు వర్ధమానుడు. కళాసాధనలో ఎన్ని కష్టాలకైనా తలఒగ్గి, తన జీవితంలో ఉత్తమలక్ష్యాన్ని గుర్తించి, మానవజాతి భవిష్యత్తుకోసం తన కళా ప్రతిభను వినియోగిస్తున్న ప్రజాగాయకుడూ, ప్రజాకవీ, నాజరు!

# పంచకళ్యాణి

## శ్రీ సూరి

ఒకనాడు మధ్యాహ్నం పాడుపడిపోయిన ఒక జట్కా స్టాండుదగ్గర హఠాత్తుగా ఓ తెల్లగుర్రం కన్పించింది. పాలనురుగులా తెల్లగావున్న దాని శరీరంమీద యెక్కడా రవంతమచ్చ అయినాలేదు మెత్తగా పట్టుకుచ్చులా ఉన్న దానితోక అందంగా సూర్యకాంతిలో ధగధగా మెరుస్తోంది.

దారితప్పి వచ్చిన బాటసారిలాగా ఉన్న దాగుర్రం. దాన్ని ఇంతకుపూర్వం ఈపరిసరాల్లో ఎవ్వరూ చూసిఎరుగరు. తన యజమాని దగ్గరనుంచీ, ఇంటి మంచీ తప్పించుకుని తిరిగి తిరిగి చివరకు ఇక్కడకు చేరుకుంది అది. విపరీతమైన ఆకలితో నకనకలాడిపోతూ నేలను వాసనచూసింది. దానినిట్టూర్పుతో రోడ్డుమీద ధూళి గప్పున పైకిరేగింది. పాపం! తినేందుకేమీ దొరకలా దానికి. దుర్వాసన కొడుతున్న అక్కడున్న చెత్తకుప్పను మూచూసి, విసుగుతో వెనక్కితిరిగింది.

కిటికీలోంచి ఇదంతా చూస్తున్న శీల తల్లి - "పాపం! బహుశా ఎన్నాళ్ళనుంచో తినటానికి దానికి ఏమీదొరికి ఉండదు. యజమాని వద్దనుంచి తప్పించుకు వచ్చివుంటుంది" అన్నది. కొత్తగా పెళ్ళి అయిన శీల తల్లి పక్కనే నుంచుని ఉంది. "అతడ్ని ఎవరో చంపిఉంటారు," అంది.

"ఏమిటే?" అని ఆశ్చర్యంతో శీల తల్లి తెల్లబోయింది. ఈ మధ్యకొన్నాళ్ళనుంచీ ఎక్కడా ఎవరూ చచ్చినట్లు ఆమెవినలేదు. కాని అక్కడక్కడా కొన్ని దురంతాలు జరుగుతున్నట్లు మాత్రం విన్నది. ఎన్నెన్నో హత్యలను గురించీ, రాక్షసకృత్యాలను గురించీ చాలా కధలుకూడా విన్నది.

ఆ గాధలు వింటుంటే అసహ్యంతో కొందరికి శరీరం గగుర్పొడుస్తుంది. కొంతమందికి ఆకలిదప్పులూ, నిద్రా కూడా ఉండవు. అయినా మానవుడంత పశువులా ప్రవర్తిస్తాడన్నది ఆమె నమ్మలేకపోయింది;

"బహుశా అతడు బ్రతికేఉండొచ్చు" అన్నదామె.

మతకలహాలతో పాడుపడినట్లున్న ఈ పరిసరాలకు ఈ తెల్లగుర్రం రావటం - ఏదో కొత్తజీవం, కళ తీసుకువచ్చినట్లుంది. కుర్రవాళ్ళంతాఎంతో ఉత్సాహపడసాగారు.

వాళ్ళలో మరీచిన్నవాళ్ళు దూరంగా నుంచుని ఆనందించసాగారు. కొంచెం పెద్దవాళ్ళు దగ్గిరకువచ్చి దాన్ని చేతులతో దువ్వి నిమరటం మొదలెట్టారు. వాళ్ళు అలా తమ మెత్తటి చేతులతో నిమురుతూంటే ఆ గుర్రం సంతోషంతో సకిలించసాగింది.

వాళ్ళకు ఈ గుర్రం రకరకాల ఆలో

చనలను కలిగించసాగింది. వారిలో చాలామంది ఈ గుర్రం, ఏ జమీందారుదో, ఏ శ్రీమంతుడిదో అయిఉంటుందనే నిశ్చయానికి వచ్చారు. అయితే భాగ్యవంతుల గుర్రాలు ఏం తింటాయి; అని ఆహార విషయికమైన ప్రశ్న వచ్చిందప్పుడు. "నీకు తెలుసా ? అవి వైను తాగుతాయి, విదేశాలనుంచివచ్చిన వైను." అన్నాడొకడు.

"అవి వైనుత్రాగకపోతేమరి అంత బలిష్ఠంగా ఎందుకుంటాయి ?" అని నందా వ్యాఖ్యానించాడు. ఇంతలో మరో కుర్రాడికి ఆలోచన రేగింది " ఇది బహుశా ఏ విరిగిపోయిన బండి గుర్రమో అయిఉంటుం"దన్నాడతడు.

నవ్వుల కోలాహలం ఎక్కువయింది. "ఎంతో పెద్ద పెద్ద గుర్రాలను చూసి ఉంటావు నువ్వు" అన్నాడు నందా.

ఈచర్చలు ఇలా సాగుతుండగానే యమునప్రసాద్ ఒక తాడు తీసుకొచ్చి దానికి కళ్లెంలాగా అమర్చాడు. అతడి చేతిలో ఒకచిన్న పేముబెత్తం కూడా ఉంది.

యమునప్రసాద్‌కు షుమారు ఇరవై ఏళ్ళు పైనఉంటాయి. నల్లగా పొట్టిగా ఉంటాడు. చిన్నధోవతిఒకటి కట్టుకుని బనీనువేసుకున్నాడు. సినిమా టిక్కెట్లు ముందుగానేకొని, సినిమా ప్రారంభించే సమయానికి వాటిని మామూలురేట్లకన్న ఎక్కువ రేట్లకు అమ్మి డబ్బు సంపాయిస్తూఉండటం అతడివృత్తి. అతడుజూదమాడుటలో కూడా నేర్పరి. 'పేవ్‌మెంట్సు'మీద కూర్చుని తన సంపాదనలో చాలాభాగం జూదమాడి పోగొట్టుకుంటూ ఉంటాడు. జూదంలో పోగా మిగిలిన డబ్బుతో చవకరకం సారాయి మొదలైనవి త్రాగి, అసహ్యంగా ప్రవర్తిస్తూ ఉంటాడు.

ఈ మతకలహాలు జరుగుతున్నప్పుడతడొక ప్రసిద్ధవ్యక్తి అయినాడు. దగ్గరలో ఉన్న దేవాలయాల మీద ఎక్కడైనా దాడి జరిగిందంటే అక్కడ మొట్టమొదట విన్పించే గొంతుక మన యమునప్రసాద్‌దే....

మిలిటరీలోనుంచి తిరిగివచ్చిన వాళ్ళకు టీ, సిగరెట్లూ సప్లయిచేస్తూ అతడు కొంతమందిని స్నేహంచేసుకున్నాడు. ఈ కుర్రవాళ్ళంతా అతడిని 'మిలిటరీ కాంటీన్' అని హేళనచేస్తూ ఉంటారు.

ఈరెండురోజులనుంచీ అతడికి దేనికీ తీరిక చిక్కటంలేదు. అతను రోజంతా ఈ గుర్రపు స్వారీలోనే గడుపుతున్నాడు.

"నేను సార్జంటునయినాను" అని కోతలు కోశాడు. కొంతమంది కుర్రాళ్లు అతడివెంట పరుగెత్తారు. ఒకళ్ళిద్దరు "దిగిరా యమునా ! మమ్మల్నికూడా కాస్త గుర్రం ఎక్కనిద్దూ?" అని అడిగారు. యమున సమాధానం ఇవ్వనూ లేదు, ఇవ్వతలచుకోనూలేదు. అతడు వారిని లక్ష్యపెట్టలేదు. టక్‌టక్‌మని గుర్రాన్ని పోనిచ్చాడు.

"ఇదేమిటి ? నువ్వేమో గుర్రమెక్కి స్వారి చేస్తూంటే మేము చూస్తూనుంచోమా ? ఇక ఇది సాగదు" అన్నాడు నకుల్,

"ఈవీధిచివరఉన్న దుకాణానికివెళ్ళి

నాకు ఒకకిళ్ళీ - కాసిని సిగరెట్లూ తెచ్చి పెట్టు. తర్వాత ఎక్కడువుగాని గుర్రం" అన్నాడు యమున.

"డబ్బులేవీ ?"

"ఓ నా పేరు చెపుదూ ! యమున ప్రసాద్ కావాలంటున్నాడని చెప్పు."

నకుల్ వెళ్ళి కాస్సేపట్లో తిరిగివచ్చి "అతడు ఇవ్వడుట ! ముందు డబ్బు కావాలంటున్నాడు" అని చెప్పాడు.

"దొంగముండా కొడుకు ! వాడి దుకాణం కాపాడాను నేను. జూదంలో మాత్రం నా దగ్గిర ఎంత డబ్బు కాజేయ లేదువాడు ? ఇప్పుడు వెధవ కిళ్ళీకోసం అర్ధణాడబ్బులు కావాలంటున్నాడు" అని యమునప్రసాద్ షాపుదగ్గిరకే పోనిచ్చాడు గుర్రాన్ని. నకుల్‌కి గుర్రం ఎక్కేందుకు అవకాశం రానేలేదు.

దసరా పండగలు వస్తున్నాయి. సాధారణంగా ఈ రోజుల్లో కుర్రాళ్ళంతా గడ్డిబొమ్మలుచేసే వాళ్ళచుట్టూమూగుతూ ఉండేవాళ్ళు. ఆ మన్ను అంతా రాళ్ళూ అవీలేకుండా మెత్తగా చేశాక అబొమ్మకు పూస్తారు బొమ్మలు చేసే వాళ్ళు. ఆ బొమ్మలు చేసేవాళ్ళ దగ్గిర కూర్చుని, వాళ్ళకి అవీ ఇవీ అందిస్తూ సహాయ పడటం ఈ కుర్రవాళ్ళకు మహాసరదా.

ఈ సంవత్సరం మత విషయికమైన పూజలకు ఉపయోగపడే ఈ బొమ్మలు చేయటం ఇంకా ప్రారంభం కాలేదు. అంచేత ఈకుర్రాళ్ళు తమసమయమంతా ఈ గుర్రం దగ్గిరే గడుపుతున్నారు. వాళ్ళు ఆ గుర్రానికి 'చాంద్' అని పేరెట్టారు.

గుర్రం అంతహుషారుగా లేదు. తెల్లగా ధగధగలాడే దానిశరీరం కొంచెం కాంతి తగ్గింది. కాళ్ళు ఈడ్చుకుంటూ నడుస్తున్నట్లుండేది. వెనకవైపున ఎడమ కాలికి గాయంతగిలింది. దానికి చీము కూడా పట్టింది.

శీలతండ్రి హృషీకేశబాబు స్థానికంగా ఉండే పెద్దలలో ఒకరు. పిల్లలంతా కూడా ఆయన్ని గౌరవిస్తూ ఉంటారు. "నువ్వు గుర్రానికేమైనా ఆహారం పెడుతున్నావా ?" అని నకుల్‌ని అడిగాడాయన.

"నందా ఆహారం పెడుతూ వుంటాడు." అన్నాడు నకుల్. నందాని అడిగితే, "అదేమో నాకు తెలియదు. ఆసంగతి యమునప్రసాద్‌ను అడిగితే అతడు చెప్పగలుగుతాడు" అన్నాడు.

ఈసంగతులన్నీ శీలతల్లి భర్తవల్ల విని తనకొడుకు సంతును గుర్రానికి మేత-పొట్టు కొనుక్కురావటానికి బజారుకు పంపింది. చాంద్ ఆతెచ్చిన ఆహారాన్ని కాస్త మూచూచి మిగిలింది వదిలేసింది.

సంతుస్నేహితుడు ఖొకాన్ "ఆ ఆహారం మరీ ఎండిపోయి వుంది. అంచేత బహుశా చాంద్‌గొంతులో గుచ్చుకుని ఉంటుంది. దానికి కాసిని నీళ్ళుతెచ్చి పడదాం" అన్నాడు.

వాళ్ళిద్దరూ వెళ్ళి నీళ్ళు పట్టుకు వచ్చారు. వాళ్ల నీళ్లుతెచ్చిన పాత్రల్లో ఒకటి మరీచిన్నది. రెండోదిచిల్లిది. అంచేతపాపం ! ఆ గుర్రానికి త్రాగటానికి నీళ్ళయినా లేకపోయినాయి.

చేతుల్లో ఏమీలేకుండా ఆ కుర్రాళ్ళు కొంతమంది దగ్గిరున్న 'టీ' షాపుకు

వెళ్ళి, పగిలిపోయిన సాసరుతో కాస్త టీ తీసుకువచ్చారు.

"ఇలావచ్చి కాస్త టీ తాగు చాంద్! గోకుల్ యిచ్చిన టీ ఎంతో బావుంటుంది. కాస్త రుచిచూడు" అని మచ్చిక చెయ్యటం మొదలెట్టారు.

కాని గోకుల్ టీ లో ఉన్న సుగుణాలు చాంద్‌ను ఆకర్షించలేక పోయాయి. అది ఒకటి రెండుసార్లు వాసనచూసి చివరకిహ ముఖం అవతలకు తిప్పుకుంది.

ఆ గుర్రం స్థితి మరీ దిగజారిపో సాగింది. ఇప్పుడు దానంతటది కదలటమే కష్టంగావుంది. కాని యమున మాత్రం మామూలుగా స్వారీచేస్తూనే ఉన్నాడు. "ఆ గుర్రానికి కాస్త విశ్రాంతి తీసుకోనీ యమున్! నువ్వుదాన్ని చంపేట్టుగా ఉన్నావు" అన్నాడు హృషీకేశబాబు.

యమున తప్పతాగి ఉన్నాడు. వచ్చీరాని హిందీ, బెంగాలీ కలిపి అతడు వాగినదాని సారంశం ఏమిటంటే—"వేల కొలది మనుష్యులే చచ్చిపోతుండగా లేవిది. అందరూ ఎక్కి స్వారిచేసే గుర్రాన్ని గురించి మీకింతదిగులెందుకు" అని పకపకా వికృతంగా నవ్వాడు. ఆ నవ్వు పదునైన కత్తిపెట్టి కోసినట్లుంది.

ఆ సాయంత్రం కొంతమంది కుర్ర వాళ్ళ సహాయంతో హృషీకేశబాబు ఆగుర్రాన్ని ఖాళీగాఉన్న ఒక గుర్రపుశాల లోకి చేర్చాడు. దాని ముందర కాసిని నీళ్ళు, కాస్తగడ్డీ తీసుకువెళ్ళి ఉంచాడు.

వాళ్ళు దాన్ని అక్కడకు తీసుకు వచ్చి రావటంతోనే శాంతిరక్షకభటులు 'లోపలికి వెళ్ళండి - లోపలికి వెళ్ళండి' అని కేకలు వేసుకుంటూ వచ్చారు ట్రక్కుల్లో.

మర్నాడు ఉదయం చూసేసరికి ఆ గుర్రపుశాల తాళం వేసివుంది. అనీళ్ళ తొట్టి బైటనే ఉంది. దాని ప్రక్కనే గుర్రం నిర్జీవంగా ఏదో ఒక మాంసం ముద్దలా నిలబడి ఉంది. దాని కళ్ళు మిలమిల మెరుస్తూనే ఉన్నాయి. కాని వాటిల్లో ఏ భావమూ వ్యక్తంకావటంలా. అది తనమీద వాలిన ఈగలను తోకతో తోలుకునేటంత ఓపికకూడా లేకుండా వుంది

సంతు దానికోసం కాసిని గుగ్గిళ్ళు తీసుకువచ్చాడు. కాని చాంద్ వాటిని వాసనైనా చూడలా.

"అవి నాచేతికియ్యి సంతూ! నాచేత్తో పెడితే తింటుందేమో చూద్దాం. నేను ఇదివరకు చాలా గుర్రాలకు ఆహారం పెట్టేవాణ్ణి. నీకు తెలిసే ఉంటుంది. మునుపు మాకో గుర్రపుబండీ కూడా ఉండేది" అన్నాడు నందూ.

ఏమయినా ఆ మూగ జంతువు కదల్లేదు. మెదల్లేదు. ఆ కుర్రాడు తన విశ్వాసాన్ని కోల్పోయాడు. "దీని జబ్బేమిటో చాలా ప్రమాదంగా ఉందిల్లే ఉంది."

అప్పుడు పదిగంటలయి ఉంటుంది. సూర్యకాంతి తీక్ష్ణంగా కొరడాతో కొడుతున్నట్లు చురచురలాడుతోంది. చాంద్ విశ్రాంతిలేక బాధపడుతోంది. ఆ కుర్ర వాళ్ళు మెల్లిగాదాన్ని బాల్కనీ నీడ దగ్గరకు నడిపించారు.

"తెల్లగుర్రాలు ఎండలో నిలబడలేవు. అంతే. అంతకన్న దాన్నిగురించి

భయపడాల్సింది ఏమీ లేదు" అని నంద్ ధైర్యం చెప్పాడు.

ఈ సమయానికి ఒక ముసిలివ్యక్తి మెయిన్ రోడ్డుచివర కన్పించాడు. అతడు నలువైపులా ఒకసారి తేరి పార చూసి ఆ సందులో ప్రవేశించాడు అతడి ముఖం ముడతలు పడివుంది. మీసాలు, గడ్డం నె రి సి పో యి ఉన్నాయి ఒక మురికి లుంగికట్టుకుని కుచ్చుటోపీ ఒకటి పెట్టుకుని ఉన్నాడు.

అతడి చేతిలోఒక చీనారేకు బాల్చీ ఉంది. అది సూర్యకాంతిలో ధగ ధగ లాడుతోంది.

అతడ్ని ఎప్పుడు ఎక్కడ చూసినా గుర్తుంచుకోతగినట్లు ఉంటాడు కాని ఈ రోజుల్లో ఈ పరిసరాలకు రావటం వల్ల ఒక విధమయిన సంచలనం కలిగించాడు "చచ్చాం బాబోయ్! ఈ సమయంలో ఇతడిక్కడికి ఎందుకు వచ్చాడు ?"అని గొ ణు క్కు న్నా డు హృషీ కేశబాబు.

ఆ ముసలివాడికి ఈ గొడవంతా పట్టటమేలేదు. అతడు దేనికోసమో వెతుకుతున్నట్లుంది. అతడు తన తీక్ష్ణమైన దృష్టులను వీధిఅంతా ప్రసరింప చేస్తున్నాడు.

కాస్సేపటికి అతడిదృష్టి గుర్రంమీద పడగానే అతడికళ్లు సంతోషంతో మెరిశాయి. అతడు గుర్రందగ్గిరకు ఎగిరి గంతేసి, దాన్ని చేత్తో నిమురుతూ, "అయ్యో సొహరబ్, ఇదేమిటి ఇలా ఉన్నావిక్కడ ?" అనుకున్నాడుతనలో, సుపరిచితమైన ఆస్పర్శతో గుర్రానికి శరీరం గగుర్పొడిచింది. నేత్రాల్ని విప్పార్చి, మనుష్యులు చూచినట్లు ఎంతో అర్థవంతంగా-చెప్పవలసిందెంతో ఉన్న దన్నట్లు చూడసాగింది. బహుశా అది మాట్లాడటం నేర్చిఉన్నా, ఇంతకన్న ఎక్కువగా తనకు తెలియచేసుకో కలిగేది కాదేమో!

బుధూ వచ్చీరాని హిందీలో "దాని పేరు సొహరబా? మేం చాంద్ అని పిలుస్తున్నాం" అన్నాడు.

"ఓ! ఏదయినా ఒకటే " అన్నాడు ఆముసలి.

"ఈగుర్రంనీదా ?" అని అడిగాడు నందు.

"కాదుబాబూ! నేను ఈ గుర్రపు వాణ్ణి. బండికూడా తోలుతానునేను."

"అయితే ఈగుర్రంనీదేఅన్నమాట" అన్నాడు నందు.

"ఠీ క్ హై" అ ని ముసలివాడు నవ్వాడు

గబగబా పంపుదగ్గరకు వెళ్ళి బాల్చీ నిండా నీళ్ళు పట్టుకువచ్చి గుర్రం ముందర పెట్టాడు అది ఒక్కచుక్క అయినా మిగల్చకుండా త్రాగేసిందినీళ్లు. 'జైహింద్' అని చప్పట్లు చరచారు కుర్రాళ్ళు.

అతడు బొడ్లోపెట్టుకు తీసుకువచ్చిన గుగ్గిళ్ళపొట్లం తీసి, ఆ గుర్రంచేత తినిపించాడు. అవి కాసినీ ఆ గుర్రం తినెయ్యటం పూర్తిగాగానే "బాబూ, మీరింకా కాసిని గుగ్గిళ్ళు తీసుకురాగలరా ?" అని కుర్రాళ్ళను అడిగాడు.

"ఓ! తప్పకుండా" అని నందా పరుగుతీశాడు. అతడివెంట నకుల్, గాబా అందరూ వెళ్ళారు, అంతాకలిసి

నాలుగు పొట్లాల గుగ్గిళ్ళు తీసుకు వచ్చారు.

ఆ గుర్రానికి కొంచెం కడుపునిండాక "సొహరబ్బుకు జబ్బుచేస్తే అది నా ఒక్కడిచేతిమీదుగా ఇచ్చిన ఆహారాన్ని మాత్రమే తీసుకుంటుంది." అన్నడా ముసలివాడు.

అతడికి పూర్వపు సంగతులన్నీ గుర్తుకు రాసాగాయి. సొహరబ్ పరుగెత్తేప్పుడుండే ఠీవీ అదీ చూసినప్పుడు ప్రజలు "ఈ పందెపు గుర్రాన్ని బండి లాగటానికి ఉపయోగిస్తావేం?" అని అడుగుతూ ఉండేవారు.

అతడు నుదురుమీద కొట్టుకుని, "మనుష్యులకులాగానే గుర్రాలకు కూడా ఖర్మఅనేది ఒకటుంది," అని సమాధానమిచ్చేవాడు.

కాని అవన్నీ చాలారోజుల క్రిందటి మాటలు. ఇప్పుడో? తర్వాత కాస్సేపాగి, "ఎప్పుడుదీనికి నయమవుతుంది? ఎప్పుడు దీన్నినేను బండి కడతాను? రోడ్లమీద స్వేచ్ఛగా తిరగటానికి ఈ భయం, కలహాలు లేకుండా ఎప్పుడు పోతాయి?" అని అడిగాడు హృషీకేశ బాబును.

పాపం! అతడు ప్రశాంతంగాఉండే పూర్వపు రోజుల్ని గురించి ఆలోచిస్తున్నాడు. ఏంచెప్పాలో హృషీకేశ్ కు తోచలేదు.

హఠాత్తుగా రాక్షసి మేల్కొన్నట్లయింది. ఆరాక్షసి నాల్గువైపులా చేతులు చాచి వికటాట్టహాసం చేస్తున్నట్లుంది. తుపానులాగా వార్తలు చెలరేగుతున్నాయి. లాల్ పట్టీలో మతకలహాలు ప్రారంభమైనాయి.

మెయిన్ రోడ్డుమీదినుంచి ఒక జన ప్రవాహం - ఒక మహానదిలో దూసుకవచ్చి ప్రవాహంకాలువలోకి పాకినట్లు-ఈ వీధిలోకి జొరబడుతూంది. జనంఎక్కడి వాళ్ళక్కడ చెల్లాచెదరయినారు. 'చంపండి, చంపండి' అని ధ్వనులు ప్రతిధ్వనిస్తున్నాయి.

ఆ ముసలివాడు విరాళా దృష్టులతో చుట్టూ చూడసాగాడు. ఆ పిల్లవాళ్ళ ముఖాలకేసి జూశాడు. సొహరబ్ కళ్ళు మిలమిల లాడాయి. ఆ చూపులెంతో జాలిగా ఉన్నాయి. ఆ గుర్రంకూడా తన యజమానికి రానున్నప్రమాదంగ్రహించినట్లుంది.

"నువ్వేం భయపడాల్సిన అగత్యం లేదు." అని ఆ ముసలివాడికి నందు ధైర్యం చెప్పాడు.

అపరిచితులైన ఎన్నో వందల నేత్రాల ముందర, అతడు వణికిపోతూ అంత ధైర్యాన్ని పొందలేకపోయాడు.

ఒకగుంపు అతడివైపుగా ముందుకు రా సాగింది. యమున, నకుల్, నంద మిగిలినవాళ్ళూ ఆ ముసలివాని చుట్టూ మూగారు. హృషీకేశ్ అజనాన్ని శాంతపరచాలని ప్రయత్నించి, "ఇతడు అమాయకుడు. చంపకండి ఇతణ్ణి" అన్నాడు.

ఆ జన సమూహంలోనుంచి అతడి మాటలను వ్యతిరేకిస్తున్న ధ్వనులు రాసాగాయి. "వీళ్ళు మనుష్యులుకాదు. రాక్షసులు."

"మిటియా మృతి నువ్వు అప్పుడే మరచిపోయావా?"

"ప్రాణానికి ప్రాణమే"

"వాళ్లు ఎన్ని ప్రదేశాలలో మనవాళ్ళని కాపాడారో తెలుసా నీకు ?" అని ప్రశ్నించాడు హృషీకేష్. "మేమూ కాపాడాం చాలామంది ప్రాణాల్ని. అనవసరపు వాగుడుకట్టిపెట్టు."

వాళ్ళని ఒప్పించటానికి ప్రయత్నించటం నిష్ప్రయోజనం. వాళ్ళతో వాదించటం వల్ల ప్రయోజనం లేకపోవటమే కాకుండా ప్రమాదంకూడా కద్దు.

"ఊరుకో కాకాబాబు!" అన్నారు యమున, నందా. అని ఇద్దరూ ధైర్యంగా ముందుకు వచ్చారు.

"పోట్లాటకు వచ్చేవారు ఎవరో ముందుకురండి!" అనిఅరచాడుయమున్.

ఆగుంపువెనక్కి తగ్గి ఆశ్చర్యంతో కొయ్యబారి పోయారు. కాని కాస్సేపు అయాక మళ్ళీక్రోధపు ధ్వనులు చెలరేగాయి. ఆ కుర్రవాళ్ళ మీద కొన్ని రాళ్ళు విసిరారు.

వీధిచివర నున్న పెద్దమేడమీద నుంచి చటుక్కున ఎవరో మిలటరీ వస్తోందని చప్పట్లు చరిచారు.

వాళ్ళంతా పరుగెత్తారు. అది ప్రాణాన్ని కాపాడుకోవాల్సిన సమయం. వాళ్లు అన్నివైపులకూపరుగెత్తిప్రాణాన్ని కాపాడు కోటానికి ప్రయత్నించారు. ప్రక్కనున్నచోట్లకు—ఎక్కడతలుపులు తెరచిఉంటే అక్కడకు పారిపోయారు. యమునప్రసాద్ ఆ ము స లి వా డి ని తప్పించుకుని ఎత్తుకుని హృషీకేశబాబు ఇంట్లో దూరపడ్డాడు.

మెషిన్ గన్స్ మ్రోగసాగాయి. మిలిటరీవాళ్ళు ట్రక్కుల్లోంచి క్రిందికిదిగారు. వాళ్ళు వీధిలో గస్తీతిరగసాగారు. అంతా నిస్తబ్ధంగా నిశ్శబ్దంగా ఉంది. కాని ఆ నిశ్శబ్దతను వాళ్ళ బూట్లచప్పుడు భేదిస్తోంది.

అది ఒకవిధమైన నిశ్శబ్దత. తలుపు సందుల్లోంచి కాని, కిటికీల్లోంచి కాని బైటికి చూడాలన్నా అంతా భయపడసాగారు. ప్రతిఒకరి దృష్టిలోనూ ఏదో తెలియనిబాధా భయమూ ఆవహించాయి.

ఒక గంట అయాక.

నందు, యమునప్రసాద్ లు ముందు బయటకు వచ్చారు. ఆ ముసిలివాడు వారికి తలుపు తెరచాడు. జనశూన్యంగా ఉన్న ఆ వీధిలోకి వచ్చేసరికి ఎండ కళ్ళకు పొడిచినట్లయింది. ఆ దృశ్యం మహాశ్మశానంలా శూన్యంలా ఉంది. వాళ్లు, వారి చూపులు ఎడమవైపుకు తిరగగానే ఒక్కసారి ఉలిక్కిపడ్డారు.

ఏమిటది ? ఆగుర్రం రోడ్డుప్రక్కన పడివుంది. దాని తెల్లటి శరీరంమీద ఎడమకాలిదగ్గిర నల్లటిమచ్చ స్పష్టంగా కన్పిస్తూనేఉంది. కుడిచెవికి వెనకకూడా ఒకపెద్ద గాయంపడ్డది.

"మేరా సాహబ్" అని పిలిచాడు ముసలివాడు. సమాధానం రాలేదు. ఆ ముసలివాడికి సాహబ్ సమాధానం ఇవ్వకపోవటం ఇదే మొదటిసారి!

(పీపుల్స్ ఏజ్ నుంచి)



## గ్రంథ సమీక్ష

**‘విజయశ్రీ’**
రచయిత : శ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రి
• (‘కరుణశ్రీ’)

వెల : రు. 1—4—0
దొరికేచోటు :
శ్రీ కృష్ణా బుక్ డిపో, తెనాలి.

“ఐనవి సంధి సంబరము
లాయుధముల్ ధరియింపుడయ్య! దా
పైనది వీరభారత మహారణరంగము..”

అని, తన రాయబారం విఫలమై పోయాక, శ్రీ కృష్ణుడు పాండవులకు కర్తవ్యోపదేశం చేస్తున్నాడు.

“....దొరలై తెకతేరకు తీయగా తినన్
మరగినవారు వారు; అలతి
మాటలతో ధరయిత్తురయ్య ? సం
గరమున ఖడ్గముల్ గదలు
గాండివముల్ చెరలాడకుండగన్!
“కాలుని దున్నపోతు చిరుగంటల
మ్రోతకు గాక సంధి వాక్యాలకు
వీనులొగ్గుదురటయ్య? మదాంధులు.....”

‘రక్కసి రాజ్యకాంక్ష’తో ఉన్న కౌరవులు మరోవిధంగా మాటవినరనీ, యుద్ధంకంటె గత్యంతరం లేదనీ కృష్ణుడు అనీ అనడంతోటే, భీముడు అందుకున్నాడు. తన శరీరాన్నీ ఆత్మనూ దహించివేస్తున్న పరాభవ జ్వాలలన్నీ ఒక్కసారిగా తలపుకు వచ్చాయి.

“అవియొక వీరభారత కులాంగన
కంటి కవోష్ణ బాష్ప బిం
దువులు ధరిత్రిపై గురియు దుర్భర
దుస్సహ దుర్దినమ్ములు
య్యవి పదిమందిలో ఒకమహాసతి
పైటచెరంగు పట్టి ధ
ర్మువు దిగద్రావి రక్కసి ప్రభుత్వము
లాగిన దుర్ముహూర్తముల్!”

అర్జునుడు కూడా ఆగ్రహంతో-

“దొరలమటంచు రాజసముతో
తెగనీలిగి పట్టుపాన్పులన్
పొరలుదినమ్ము లన్నియునుబోయె,
ప్రపంచము మారిపోయె”

నన్నాడు. ‘వీరభారత కులాంగన, ద్రౌపదికి ధర్మరాజుయొక్క ‘అజాత శత్రుత్వం’ లో నమ్మకం పోయింది.

“అధిష్ఠితోద్దండ యుధిప్రకాండుడా
యుధిష్ఠిరుండెంతటి సార్థకాఖ్యుడో

అనిధర్మరాజును ఒకమాటలో అభినందించి- వెంటనే అతని ‘వేదాంతాన్ని’ ఎత్తి పొడుస్తోంది:

“అజాతశత్రుత్వ యశోభిలాషలో
స్వజాతి చైతన్యము విస్మరింతురో!”

ధర్మరాజు కింకా చీమైనాకుట్టినట్లు లేదు. మళ్ళీరాజీబేరాలకుదిగాడు. ‘హింసామయ జీవనుల ప్రశంసింతురటయ్య ధర్మశాస్త్రజ్ఞులు ?” అని వేదాంతం లంకించుకున్నాడు. ఓర్పుకు హద్దుదాటిపోయింది. పాంచాలి సహించదు.

“అయెనుబోయె సంధి: ఇకనైనను
నాయకు లాయుధమ్ములన్
దీయక, ధర్మశాస్త్రములు త్రిప్పుట
నమ్మినవారి గొంతుకల్
కోయుటకాదె ? మీరు కయికొన్న
అహింసలు హింసలయ్యె నా
త్మీయులయందు - చాలు,
గురుతింపుడు పీడిత జాతియాతనల్!”

“. . ...... శౌర్యధైర్యముల్
చాలవ యేని ధర్మములు చాలిక,
పెద్దలు మిన్నకుండుడీ-
బాలురుదీర్తురీ సమర భారము
భారత భాగ్యమూర్తులై!”

ఇంత నిక్కచ్చిగా అడుగుతున్న ద్రౌపదిమాట పూర్తికాకముందే, “ఏమీ యిప్పటికైన ముందడుగు! లేనేలేద

నేపథ్య మిధ్యా మీమాంసల కంతు కల్గద ?" అని త్వరపెడుతున్నాడు భీముడు. ధర్మరాజులో కదలికవచ్చింది. "ఏమయిన తప్పదిక సంగ్రామమ్మ.... మా 'మాతృశ్రీ' బిడ్డలకేమవి సందేశ మంపె ?" నని కృష్ణుణ్ణి అడుగుతాడు.

"వీరభారతభూమి నావిర్భవించి
పౌరుషములేని బానిస బ్రతుకులేల?
ఈఅయోమయ శృంఖలాలింకనైన
త్రెంపుకొనిబైటపడివిజృంభింపరేల"

అని 'మాతృశ్రీ' పంపిన సందేశం కృష్ణునిద్వారా అందుకొన్నారు పాండవులు. "వందేమాతరమంచు భక్తిమెయి సంభావించిరాత్మ ప్రసూసందేశమ్ము."

తర్వాత. కృష్ణార్జునులు స్కంధావారాన్ని దర్శించడమూ, అర్జున విషాదమూ, కృష్ణుని ప్రబోధమూ, అర్జున విజృంభణమూ కథావస్తువుగా. శ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రిగారు తన 'విజయశ్రీ' కావ్యాన్ని చిత్రించారు.

ఇందులో మహాభారత గాధను చిత్రించినట్లు కనిపిస్తున్నాడు కరుణశ్రీ: కాని, నిజానికి ఆయన చిత్రించిందీ, చిత్రించ దలచుకొన్నదీ నేటి దాస్య భారత గాధను మాత్రమేనని పాఠకులకు సులభంగా తెలుస్తుంది. ఈ దృష్టిలో రచయిత చాలావరకు కృతార్థుడైనాడనే చెప్పాలి. రచయిత ఈనాడు ఇవ్వదలచు కొన్నసందేశాన్ని. ఒకానొక పూర్వగాధ నాలంబనంగా చేసుకొని ఇస్తున్నాడు. ఆపూర్వగాధ. ప్రస్తుతవృత్తాంతానికివేసిన మేలిముసుగులాగా. చివరివరకూ చదువరులహృదయాలను గిలిగింతలుపెడుతూ జాతీయాభిమానం రేకెత్తిస్తుంది.

శ్రీ పాపయ్యశాస్త్రిగారు తన 'విజయశ్రీ'లో నిజంగా భారతస్వాతంత్ర్య విజయశ్రీ నే లక్షించారు అయితే తన లక్ష్యాన్ని సూటిగా. నేటి జీవితానికే అన్వయించి చెప్పకపోవడంవల్లా. ఏ పూర్వగాధనో ఆచ్ఛాదనగా స్వీకరించడంవల్లా, ఇందులో ఆయన వ్యంగ్య వైఖరి ప్రశంసార్హం కావచ్చుగాని, ఆయన సందేశం తగినంత బలంగా తగలదు ఎక్కడపడితేఅక్కడ ఆ పూర్వగాధా ప్రాభవంకనిపించి, అంతదాకా పాఠకుణ్ని ఉత్తేజపరచిన ప్రస్తుతచ్ఛాయ అంతలో సన్నగిలిపోతుంది.

అంతేకాదు, 'మంత్రాలోచనం'తోనే ప్రజానీకానికి ఆయన ఇవ్వదలచుకొన్న సందేశం ముగిసినప్పటికీ, ఇంకా పూర్వ భారత గాధ ముగియకపోవడంవల్ల, స్కంధావార విషాద ప్రబోధఘట్టాలు పెరిగినట్లు కనిపిస్తున్నాయి. ఇక్కడ రచయిత సందేశం పునఃపునరుక్తమై తేలిపోతున్నది. వర్తమాన పరిస్థితులను వర్తమానగాధల్లో చిత్రించినట్లు, పూర్వగాధల్లో చిత్రించడం ఎవరికీ సాధ్యంకాదు. ఈ సత్యాన్ని శ్రీ శాస్త్రిగారు గుర్తిస్తారని నమ్ముతాను.

మొత్తంమీద, "విజయశ్రీ" శ్రీ శాస్త్రిగారి ఉత్తమ కావ్యాల్లో ఒకటి. ఇందులో ప్రతి పద్యమూ జీవంతొణికిసలాడుతూ, పిలిచి పలకరించినట్లు, పాఠకుడి హృదయంలోకి చొచ్చుకుపోయి స్వాతంత్ర్య ప్రబోధం చేస్తుంది. మహా ప్రవాహంలా, గంభీరమైన ఆయన పద్యగమనం, ఆయన ఇవ్వదలచుకొన్న సందేశానికి పరిపూర్ణతాగౌరవాన్ని ప్రసాదిస్తుంది. ఇలాంటి ఉత్తమకవితా లక్షణాలుగల "విజయశ్రీ" ఆంధ్ర ప్రజల ఆదరాభిమానాలను చూరగొంటుందనీ, రచయిత ఇతోధికంగా ప్రజా శ్రేయస్సుకోసం రచన సాగిస్తాడనీ నమ్ముతున్నాను. — ప్రయాగ

# సాహిత్యవిమర్శ - లెనిన్ దృక్పథం

## మైకేల్ లిఫిషిజ్

ఉలాన్ ఉడే మాడల్ స్కూలు ఉపాధ్యాయుణ్ని గురించి ఈ మధ్యనే 'లిటరేచర్నయా గజెటా'లో ఒకవిమర్శ వచ్చింది నిరంకుశమైన రాజ్యాంగ యంత్రంలోకి రాకుండా క్రమంగా ఆర్థిక పతనం చెందుతున్న ఉన్నత వర్గాలకు చెందిన ఛాందస భావాలుకల పల్లెటూరి పెద్దలకు లియోనికలో విచ్ టాల్‌స్టాయి ప్రతినిధి అని అసూయా పరుడైన ఈ ఉపాధ్యాయుడు తన విద్యార్థులకు ప్రబోధించాడట

ఈ 'టాల్‌స్టాయి వర్ణన' చూస్తే ఎవరైనా విరగబడి నవ్వుతారు. కాని, సాహిత్య శాస్త్రమనే పేరిట ఇప్పుడున్న కొండ గుర్తుల్లో ఒక దాన్ని పట్టుకొని సాధారణీకరించి, పాపం ఆ ఉపాధ్యాయుడు చిలకలా వల్లించాడేగాని మరేమీ కాదు. అయితే ఈ 'కొండగుర్తు' ఎట్లా పుట్టింది అనే విచారణ అవసరం. "ప్రాపంచిక దృష్ట్యా ఉన్నత వర్గాల జీవిత వాస్తవికతే టాల్‌స్టాయి రచన" అని కీర్తిశేషుడు ఫ్రిచే నిర్వచించాడు. అనిర్వచనాన్ని తీసుకొని అతని శిష్యులు చిలువలు పలువలుగా ఉన్నత వర్గాలను శల్య పరీక్షచేసి విభజించి, అందులో టాల్‌స్టాయి ఏరకమైన ఉన్నత వర్గానికి ప్రతినిధి అనే చర్చలకు దిగారు. ఇక్కడ అసలు ప్లెఖనోవ్‌నుంచే ఫ్రిచే తన నిర్వచనం సంగ్రహించాడనడంలో సందేహం లేదు. ప్లెఖనోవ్ దృష్టిలో "టాల్‌స్టాయి ఉన్నతవర్గాల చరిత్రకారుడు" మాత్రమే. మహాప్రతిభావంతుడైన టాల్‌స్టాయిని, ప్లెఖనోవ్, "ఉన్నతవర్గాలకు చెందిన కళాకారుడి మనస్తత్వం" క్రిందికి దిగలాగి పారేసాడు

కాని టాల్‌స్టాయినిగూర్చిన లెనిన్ దృక్పథం ఇందుకు పూర్తిగా విరుద్ధమని అందరికీ తెలుసు రచయిత చుట్టూ ఉన్న వాతావరణం అతని మనస్తత్వం మీద పనిచేస్తుందనీ, దాన్నిబట్టే అతని ఇష్టానిష్టాలు ఉంటాయనీ రుజువు చెయ్యటానికి మరొక నిదర్శనంగా మాత్రమే టాల్‌స్టాయి రచనలు ప్లెఖనోవ్‌కు ఉపయోగించాయి కాని లెనిన్ దృష్టిలో మాత్రం "ఉనికే చైతన్యానికి నిర్ధారణ" అన్న భౌతికవాద సూత్రానికి ఎంతో గంభీరమైన అర్థం ఉంది. టాల్‌స్టాయి రచనల్లో ఒకానొక వర్గపు మనస్తత్వ ప్రభావాలను మరీమరీ తరచి చూడడానికి లెనిన్ పూనుకోలేదు. ఉన్నత వర్గాల ఆర్థికస్థితిలోని విశేషాలను వెదకడం మీద కాక, విశాలమైన చారిత్రక దృక్పథంతో, సంఘంలోని వివిధవర్గాల అన్యోన్యసంబంధాలను, సంఘర్షణలను దృష్టిలోపెట్టుకొని సాంఘిక జీవితం

మీద ఆధారపడి లెనిన్ తన విమర్శన సాగించాడు.

అయితే, టాల్‌స్టాయి ప్రత్యేకత యెక్కడ ఉంది? "కళాకారుడుగా ప్రపంచంలో అతని ప్రాముఖ్యము, మేధావిగాను, ప్రవక్తగాను అతనికున్న ప్రపంచ ప్రఖ్యాతి కూడా, రష్యన్ విప్లవానికి ప్రపంచంలో ఉన్న ప్రత్యేకతనే ప్రతిబింబిస్తున్నాయి" అని లెనిన్ వ్రాశాడు టాల్‌స్టాయి లక్షలాది ప్రజానీకంచేత ఎల్లప్పుడూ ప్రేమించబడే వట్టి కళావేత్తమాత్రమే కాదు. "అప్పటి రాజ్యాంగ యంత్రం క్రింద నలిగిపోతున్న కోటానుకోట్ల ప్రజల మనస్తత్వాన్ని శక్తివంతంగా చిత్రించడంలోనే టాల్‌స్టాయి కళాప్రతిభ కనిపిస్తుంది. ఆయన ఆనాటి ప్రజల జీవిత పరిస్థితులను వర్ణించాడు ఆనాటి నిరంకుశ పరిపాలనమీద వారికున్న అసహ్యాన్నీ, ద్వేషాన్నీ వెల్లడించాడు" ఇవి 1910 లోనే లెనిన్ చెప్పిన మాటలు; ప్లెఖనోవ్ కొలబద్దలకూ, లెనిన్‌మాటలకూ ఎంత అంతరం వుందో చూడండి ప్లెఖనోవ్ దృష్టిలో టాల్‌స్టాయి "ఉన్నతవర్గాల చరిత్రకారుడు" లెనిన్ దృష్టిలోనో? ఆయన ఆనాటి రైతు ప్రజా ఉద్యమపు బలాబలాలను చిత్రించిన కళాకారుడు. 'శ్రామికపోరాటం - టాల్‌స్టాయి' అనే వ్యాసంలో లెనిన్ "టాల్‌స్టాయ్‌రచనల్లో ఎవరి దృక్పథం ప్రతిబింబిస్తున్నది?" అని ప్రశ్నించి ఇలా చెప్పాడు: "తమ మీద పెత్తనం చెలాయిస్తున్న యజమానులను ద్వేషించడం మాత్రమే నేర్చుకొని, ఇంకా ఆ యజమానులకు వ్యతిరేకంగా చైతన్యవంతమైన నిరంతర పోరాటం జరిపే స్థాయికి రానటువంటి ఆనాటి కోట్లకొలది రష్యన్ ప్రజల వాక్కే- టాల్‌స్టాయి పెదవులనుంచి వినిపించింది."

ఒక 'ఉన్నత వర్గాల కళాకారుడు తన దేశంలోని ప్రజా ఉద్యమాన్ని ప్రతిబింబించగలడా? అసలు ఇలాంటిభావం మార్క్సిజానికి వ్యతిరేకమనే ప్లెఖనోవ్ ఊహ. ఈ దృక్పథం నిజంగా సనాతన మెన్షివిక్కుల గ్రుడ్డి మార్క్సిజానికి వ్యతిరేకమే. తనచుట్టూ ఉన్న వాతావరణం మీద రచయిత మనస్తత్వం ఎలా ఆధారపడుతుందో అలాగే సాంఘిక జీవితంమీద సాహిత్యం ఆధారపడుతుందని ప్లెఖనోవ్ వాదం. ఈ చారిత్రక సత్యాన్ని ప్లెఖనోవ్ ఒంటి కంటితోనే చూశాడు, ఒకవైపే చూశాడు కాని, కళాసాహిత్యాలు వాస్తవిక జీవితాన్ని బహుముఖాలుగా వ్యక్తపరిచే మానవ జీవిత వాస్తవిక స్వరూపాన్ని అద్దంలోలాగా ప్రతిబింబిస్తాయన్న చారిత్రక సత్యాన్ని అతడు పూర్తిగా మరచిపోయాడు. లెనిన్‌మాత్రం తనవిమర్శనలో సూటిగా ఈ దృక్పథంనుంచే బయలుదేరాడు.

ప్లెఖనోవ్ యొక్క 'కళా సాంఘికత్వపు' కాకిచూపు సాహిత్య విమర్శమీద వాఙ్మయ చరిత్రమీద తన దుష్టప్రభావాన్ని విరజిమ్మింది. నేటి చెత్త రకం సాంఘికవాదులందరికీ అతనే పునాదులు వేసిపెట్టాడు తనచుట్టూవున్న వాతావరణాన్నిబట్టీ, తాను పెరిగిన సమాజాన్నిబట్టీ, ఆ సమాజపు అవసరాలను బట్టీ తనమీద పడిన ప్రధానమైన మాన

సికానుభవాలనే ప్రతికళాకారుడూ చిత్రిస్తాడనీ సాంఘికశాస్త్రరీత్యా ఒకసూత్రం వుంది. చేయి కోసుకున్నప్పుడు నొప్పి ఎలా కలుగుతుందో, అలాగే యీ అనుభవాలు అనుకోకుండానే వాటంతటవే వస్తాయి. ప్రతి ఒక వర్గానికీ దాని ప్రత్యేక మనస్తత్వంవుంటుంది. ఆయా వర్గాలు తమ సుఖదుఃఖాల ననుసరించీ, బాధానుభవాల ననుసరించీ విభిన్నమానసిక ప్రవృత్తులు కలిగివుంటాయి. కళ తన వర్గంయొక్క ఆ యా మానసిక ప్రవృతులను కళారూపాలనే నిధుల్లోకి సేకరిస్తుంది. ఇది ప్లెఖనోవ్ దృక్పథం. అయితే, ఈ దృక్పధాన్నిబట్టి ఏ కళాకారుడికీ బాధ్యత అనేది వుండదు. మనం ఒక కళాకారుడితో చర్చించడంగానీ, ఒక విషయంమీద అతన్ని ఒప్పించడంగానీ, ఆక్షేపించడంగానీ ఉండదు. గట్టిగా మాట్లాడితే, మనం అతన్ని అభినందించడంగానీ, నిందించడంగానీ అర్థంలేనిపని అవుతుంది. అప్పుడు రచయిత ఏ సమాజం నుంచి వచ్చాడో ఆ సమాజ వాతావరణంలో ఏర్పడిన తన మనస్తత్వాన్ని చిత్రించడం అతని హక్కు అవుతుంది. ఇంకా వివరించి చెప్పాలంటే, రచయిత తనను గూర్చీ, తనయొక్క, తనవర్గంయొక్క జీవితాన్నిగూర్చీ, తన స్థితిగతుల్ని గూర్చీ, తనదొడ్లోఉన్న పెంటపోగును గూర్చీ చెప్పుకోవచ్చు ఈ పెంటపోగుకు కళాకారుణ్ని మనం ఎంతసన్నిహితంగా అతికిస్తే, మన విమర్శ అంత ఖచ్చితమైనదీ, శాస్త్రీయమైనదీ అవుతుంది. ఈ విధంగా ప్లెఖనోవ్ కంటె గట్టిగా కూడా, అనేకమంది 'సాంఘిక శాస్త్రానికి ప్రతినిధులమనేవారు' వాదిస్తారు.

వీరి దృష్టిలో సాహిత్యమంటే ఏమిటి? వాస్తవిక జీతతానికి ప్రతిబింబమా? కళాకారుణ్ని ఆవరించివున్న యధార్థజగత్తుయొక్క, అతని వర్గంయొక్క, అతని సాంఘికస్థితియొక్క చిత్రణమా? ఇదేదీ కాదు. "వర్గ చైతన్యంయొక్క ఊహా రూపమే సాహిత్యం." అది "కొన్ని సంకేతాల ద్వారా తన్నుతాను వ్యక్తం చేసుకొనే వర్గ చైతన్యంయొక్క ఒకానొక రూపం" ఇదీ 'సాహిత్య సర్వస్వం' లో ప్లెఖనోవ్ అనుచరులిచ్చిన వివరణ. దీన్నిబట్టి సాహిత్య వస్తువు యధార్థ జగత్తునుంచికాక, ఒక ప్రత్యేకవర్గ మనస్తత్వంలోని లోతుల నుంచి తీసుకోవలసి వస్తుంది. కొంతమంది వాఙ్మయ చరిత్రకారులు ఇంకా ఒకఅడుగు ముందుకువేసి సాధారణంగా కళాకారుడు తనవర్గాన్ని తప్పితే చిత్రించలేడు అనికూడా నిర్వచించారు. ఇప్పుడు గొగేల్ నీపరుకోసక్కులను గురించి వ్రాసాడనుకోండి. నిజంగా అతను నీపర్ కోసక్కులను గురించి వ్రాయనే లేదనీ, యుక్రేనియన్ దుస్తులలో మరుగు పడివున్న తనవంటి సంపన్నులను గురించే వ్రాసాడనీ, ఈ విమర్శకుల దివ్యదృష్టికి గోచరిస్తుంది.

ఈవిధంగా ప్రతిసాహిత్యగ్రంధమూ కొన్ని సంకేతాలతో కూడిన టెలిగ్రాము క్రిందికి తేలుతుంది. కళా చరిత్ర అంతా వర్గ స్వభావంతో కూడిన కొన్ని ఊహలయొక్కా, సంకేతాల యొక్కా

సంపుటీకరణ మవుతుంది కనుక సాంఘిక శాస్త్రరీత్యా ఆ ఊహల సంకేతాల ప్రతిద్వంద్విని మనం కనిపెట్టాలంటే ముందు వాటి అంతర్యం వెతకాలనే వీళ్ళ ఉద్దేశం అందుకనే ఎక్కడయినా రచయిత తన వర్గ స్వభావాన్ని పొరపాటున అయినాసరే ప్రతిబింబించాడా అంటే దొంగను పట్టుకున్నట్లుగా అతన్ని పట్టుకోవాలనే తలతిక్క వీళ్ళను పట్టుకొన్నది "ఓ నా నిర్భాగ్య హృదయమా, బ్రద్దలైపో! వెంటనే బదా బదలైపో!" అని షేక్ స్పియర్ నాటకంలోని జూలియట్ పాత్ర అన్నప్పుడు, ఇలా దుఃఖాన్ని వెలిబుచ్చినందుకు, నాటక పితామహుడైన షేక్స్పియర్ మహాకవిని లండన్ వర్తకులతోను, వ్యాపారస్తులైన ప్రభువులతోను, పెట్టుబడిదారులైన భూస్వాములతోను, ఈ సాంఘిక శాస్త్రజ్ఞులు పొత్తు కలుపుతారు.

ఇలాంటి పిచ్చి కళలతో లెనినిస్టు విమర్శ కేమీ సాజాత్యం లేదు. ప్రజలు దృఢ మనస్కులు వారి చైతన్యం ఏ ఊహాగానం వల్లనో ఏర్పడ్డ మానసిక ప్రవృత్తి కాదు యధార్థ జగత్తునూ, జీవిత వాస్తవికతనూ ప్రతి బింబించేదే చైతన్యం, రచయితలూ, కళాకారులూ ఈ సత్యాన్నే ఇంచుమించు ఖచ్చితంగా తమ కళారూపాల్లో చూపిస్తారు కాని పైని చెప్పిన సాంఘిక శాస్త్రజ్ఞులు "సాహిత్యంలో జీవితమే ప్రతిఫలిస్తుం" దన్న లెనిన్ మాటలను త్రోసేసి, "సాహిత్యాన్ని వర్గ సంకేతాల మయం" చెయ్యడంలోనే తప్పుడు దోవ తొక్కారు, ఇక్కడే వాళ్ళు మార్క్సిజానికి దూరమైపోయారు

"అయితే సాహిత్యంలో జీవితమే ప్రతిఫలిస్తుందన్న సిద్ధాంతాన్ని వర్గ దృష్ట్యా సమన్వయించడం ఎట్లా?" గని ఈ చేతకాని సాంఘికశాస్త్రజ్ఞులు అబ్బురపోతారు. సాహిత్యం జీవితవాస్తవికతను ప్రతిబింబించేటట్లయితే, 'వర్గ దృక్పథం గతి ఏమిటి? ఈధర్మ సందేహాలన్నీ "ముందుమనం చేయవలసిందేమిటి?" అన్న లెనిన్ గ్రంధంమీద ప్లెఖనోవ్‌కూ, మెన్షివిక్కులకూ ఇతర ఆర్థికవేత్తలకూ ఆనాడు వచ్చిన ధర్మ సందేహాలకు నకళ్లు. ఇందులో కొత్తఏమీ లేదు. అప్పుడు-లెనిన్ ఆదర్శవాదంలో మునిగిపోయి, వర్గస్వభావమైన చైతన్యాన్ని విస్మరించాడనికూడా వీళ్ళు ఆరోపించారు

తమ వర్గం దృష్టిలో సత్యాలూ, ఎదుటివర్గం దృష్టిలో అసత్యాలూ అయిన కొన్ని రకాల సాంఘిక మనస్తత్వాలనూ, మరికొన్ని తరహాల ఊహాపోహలనూ నిర్వచించడమే వర్గ దృక్పధమని ఈ గుడ్డి మార్క్సిస్టుల అభిప్రాయం. సాంఘిక శాస్త్రజ్ఞుడు ఈ రకరకాలను ఏర్చికూర్చి, చాకలిపద్దు మాత్రం వ్రాస్తాడు వాల్టేరు నవలలోని డాక్టర్ పాంగ్లాస్‌లాగా "ఏది ఎట్లా వుండాలో అట్లాగే వుంది. అది మరో విధంగా వుండదు" అని వాదిస్తాడు.

కాని, లెనినిజం దీనికి పూర్తిగా విరుద్ధమైనది. కావ్యజగత్తులో వర్గ స్వభావాన్ని ఊహాచిత్రణనుబట్టి కాక, యధార్థ జీవితంలో ఎంత పొచ్చుకు

పోయింది అనే దాన్నిబట్టి నిర్ణయిస్తాం. ఈ యధార్థ జగత్తునుంచే వర్గ సిద్ధాంతంతో కూడిన ఊహా చిత్రణ వస్తుంది. ఇది రచయిత ఇచ్చే ప్రబోధమేకాని, రచనకు ప్రాతిపదికకాదు ఎవడైతే తన కాలంలో జరుగుతున్న అన్యాయాన్ని అసత్యాన్నీ, దోపిడినీ, దౌర్జన్యాన్నీ - ఏరూపంలో వున్నాసరే-ద్వేషించగలుగుతాడో, వాడు విప్లవవర్గానికి సంబంధించిన తత్వవేత్త అవుతాడు ఎవడైతే తన వ్యక్తిగత జీవితంలో నిమగ్నుడై బయటి ప్రపంచంతో సంబంధాలు తెంచుకుంటాడో, వాడు శాశ్వతంగా అభివృద్ధి నిరోధక తత్వంలోనే వుండిపోతాడు.

మెన్షివిక్కుల గ్రుడ్డి మార్క్సిజాన్ని లెనిన్ త్రోసిపుచ్చాడు వర్గచైతన్యమనేది అకస్మాత్తుగా పుట్టుకురాదని లెనిన్ చెప్పాడు. ఎవ్వడుకూడా ఒకానొక వర్గపు తత్వవేత్తగాజన్మించలేదు, కానిక్రమంగా అతనిలో ఏదో ఒక వర్గదృక్పధం పెంపొందుతుంది. శ్రమికవాదం అంటే మార్క్సిజం శ్రామికుడి మనస్తత్వ విస్తృతిలో పుట్టుకొచ్చిందికాదు; ఫాక్టరీ పరిస్థితుల్లో అమాంతం తలెత్తిందికాదు సమాజంలోని అన్నివర్గాల జీవితాన్నీ, ఆయామనఃప్రవృత్తులనూ, నీతినీ, రాజకీయాలనూ పరిశీలించిన కొద్దీ నిజమైన వర్గచైతన్యం పెంపొందుతుంది.

ప్లెఖనోవ్ నుంచి సోంబర్టుదాకా, మాక్స్‌వీబర్, ట్రాల్ష్, మాన్‌హీం, హాసెన్‌షన్ మొదలైన బూర్జువా సాంఘిక తత్వవేత్తలు చెప్పే వర్గ సిద్ధాంతం ఎంత మడికట్టుకు కూర్చున్నదో అంతగుడ్డిది. అంతగా అది లోకానికి దూరమైపోయి చుట్టూ గోడలు కట్టుకొని తనలో తానే గుడుగుడు గుంచాలకు దిగింది చివరకు ఇది విప్లవ వ్యతిరేకతకే దారితీస్తుంది. శ్రామిక వర్గం తన చుట్టూఉన్న సాంఘిక పరిస్థితులను అర్థంచేసుకోనంత వరకూ, అధికారంలోవున్న వర్గాలయొక్క అభివృద్ధినిరోధకతత్వ ప్రభావం క్రిందనే వుంటుంది బయటి ప్రపంచాన్ని అర్థం చేసుకోవడం ద్వారానే శ్రామిక వర్గం తన చారిత్రక కర్తవ్యాన్ని గుర్తిస్తుంది. అదేవర్గచైతన్యమంటే: లెనిన్ ఇలా చెప్పాడు :

> "మానవ విజ్ఞానం ఎప్పుడూ సూటిగా సరళరేఖలాగావుండదు. ఒకే కేంద్రంనుంచి వలయాలు వలయాలుగా తిరిగే వక్రరేఖ లాగా అంతకంతకూ ముందుకు సాగుతూవుంటుంది. ఈ వక్ర రేఖలో ఏ ఒక్క భాగాన్నయినా (ఒక పక్షములో మాత్రమే) స్వతంత్రమైన, సంపూర్ణమైన సరళరేఖగా మార్చవచ్చు. కాని ఇక్కడ ద్రష్ట, ధూమాన్ని చూసి అగ్నిని ఊహించుకోలేకపోతే, ఈ సరళరేఖ సూటిగా బానిసత్వపు ఊబిలోకి ఈడ్చుకుపోతుంది. (ఈ బానిస దృక్పధాన్నే అధికారవర్గాల వర్గ ప్రయోజనాలు బలపరుస్తాయి)"

ఒకవంక చైతన్యంతోకూడిన విప్లవ తత్వమూ, రెండోవంక అజ్ఞానాన్నీ, అసత్యాన్నీ సమర్థించడమూ అనేవి అన్నియుగాల్లోనూ వున్నాయి. కాని,

ఈ సర్వ సాధారణమైన స్పష్టమైన వర్గ వైరుధ్యం ఇలా ఉన్నప్పటికీ తమ పైన దారుణంగా పెత్తనంచెలాయిస్తున్న నిరంకుశ పాలకులను ద్వేషిస్తూకూడా. చైతన్యవంతమైన సంఘటిత పోరాటానికి ఇంకా తయారుకాని కోటానుకోట్ల ప్రజానీకం ఎప్పుడూ వుంది. వాస్తవంగా ప్రజల్లో కనిపించే ఈ తికమక. ఏ వర్గానికావర్గం తేలిపోకుండా అటూ ఇటూ కానట్లు ఉండడం. (1861-1905 మధ్య రష్యాలోను. 1789-1848 మధ్య జర్మనీ. ఫ్రాన్సుల్లోను ఇలాగే వుంది.) తత్ఫలితంగా ప్రజల్లో వచ్చే దిగజారుడుతత్వం - ఇవి దృష్టిలో పెట్టుకుంటే వెనుకటి మహాకవులూ, కళాకారులూ, జీవకారుణ్యవాదులూ ఎందుకు తప్పటడుగులు వేసారో తేటతెల్ల మవుతుంది. మన పురాతన సంస్కృతీనిర్మాతల సాంఘిక చైతన్యంలో కొంత అభ్యుదయ దృక్పథమూ, కొంత అభివృద్ధినిరోధక దృక్పథమూ స్పష్టంగా కనిపిస్తాయి. ఏవో చెదురుగా తప్పితే, సాహిత్యంలో ఎప్పటికప్పుడు విప్లవభావాలు సూటిగా ప్రతిఫలించనే లేదు. పురాతన సమాజాల జీర్ణ మర్యాదలను తిరస్కరించడంతో పాటు, రచయితలూ, కళాకారులూ తమ చుట్టూవున్న ప్రపంచంలో మానవ చరిత్రలోని అనేక క్లిష్టసమస్యలకు పరిష్కార మార్గం చూపలేకపోయారు. అందువల్లనే వారు మతాన్నీ, సంప్రదాయ సిద్ధమైన నీతి నియమాలనూ, రాజుగారి కొరడాను, సేనాపతి చేతి కత్రమూ ఆశ్రయించవలసి వచ్చింది. ఈ ఆశ్రయాన్ని పరిపాలక వర్గాలు ప్రోద్బలపరిచాయికూడా.

కష్టాల్లోఉన్న ఉన్నత వర్గాల మనస్తత్వాన్ని మాత్రమే టాల్‌స్టాయి చిత్రించినట్లయితేను. పెట్టుబడిదారులైన భూస్వాముల సుఖదుఃఖాలను మాత్రమే పుష్కిన్ గానంచేసి నట్లయితేను, అప్పుడు మన వాఙ్మయ చరిత్ర అనేది చాలా తేలిక పని అయిపోతుంది. "నిజంగా గొప్పవాడైన ప్రతి కళాకారుడూ ప్రధానమైన కొన్ని విప్లవ ధోరణులనైనా తన రచనల్లో ప్రతిఫలింప జేసి వుంటాడు" అని లెనిన్ అన్నాడు. అంతేకాదు. ఆఉత్తమ కళాకారుడైన టాల్‌స్టాయి తన వర్గపు సరిహద్దులు దాటి. లక్షలాది ప్రజల బాధలనూ వారి మనస్తత్వాన్ని ఎలా ప్రతిబింబించాడో కూడా లెనిన్ ఋజువు చేసాడు ప్రాథమిక ప్రజా స్వామిక దృక్పథంతో కూడిన ఆనాటి రైతుల మనస్తత్వాన్నే టాల్‌స్టాయి చిత్రించాడు ఇది నిజంగా ఆయన వర్గానికి సంబంధించింది కాదు. కాని, ఈప్రాథమిక మనస్తత్వమే మొత్తం కర్షకోద్యమంమీద (1861—1905) తన గిరులు గీచుకొని కూచుంది. భూమిని సంఘపరం చెయ్యాలని చెప్పవలసి వచ్చినప్పుడు, ఆనాటి రష్యన్ రైతు "ఈ భూమి ఎవ్వరిదీ కాదు. భగవంతుడిది" అని చెప్పేవాడు. అలాంటి రైతుకు, అతని ఆందోళనను వర్ణించడంలో టాల్‌స్టాయి కంటె బాగా చెప్పేవాడు దొరకడు.

హెర్జన్ రచనలను కూడా లెనిన్ ఈ దృక్పథంతోటే సమీక్ష చేశాడు

"1848 తర్వాత హెర్జెన్ మానసికంగా క్రుంగిపోయి నిరాశా విప్ల వాదాల్లో పడిపోవ డానికి కారణం, సోషలిజంతో బూర్జువావర్గపు సుఖస్వప్నాలన్నీ పతనం కావడమే. యూరపులో ఆనాడు బూర్జువా ప్రజా స్వామ్యంలోని విప్లవ దృక్పధం నశించిపోతున్నది. కాని విప్ల వాత్మకమైన సోషలిస్టు శ్రామిక వర్గం ఇంకా తలెత్తలేదు. ఈ యుగసంధిలోనే హెర్జన్ తాత్విక నాటకం వచ్చింది, ఈ యుగ సంధినే ప్రతిబింబించింది."

బూర్జువా ప్రజాస్వామిక మంటే విసుగెత్తిపోయి, ఇంకా శ్రామికప్రజా స్వామికాన్ని అందుకోకుండా, ఇప్పటి పెట్టుబడిదారీ సమాజంలోకూడా చాలా మంది వున్నారు. వాళ్ళ అయోమయమే థామస్‌మాన్ నుంచీ సిలైన్ దాకాగల వివిధ పాశ్చాత్య రచయితల కళా రూపాల్లో ప్రతి ఫలించింది. వర్గదృష్టిలో వాళ్ళస్థానమేమిటో తేల్చిచెప్పాలంటే. ఆనాటి ప్రధాన సమస్యలైన ఆస్తి, అధి కారాల విషయంలో వాళ్ళు అవలం బించిన దృక్పధాన్నిబట్టి చెప్పాలి

ఈ ప్రజలకు ఏ 'పెటీబూర్జువా' మనస్తత్వమో అంటగట్టి సంతృప్తి పడడం ఎంత ప్రమాదకరమైన ఫలితా లకు దారితీస్తుందో ఇప్పుడు తెలు స్తుంది. యానటోల్ ఫ్రాన్సు మధ్యరకం బూర్జువా తత్వవేత్త' అనీ, రొమారోలా 'పెటీబూర్జువా కరుణావాది' అని మన వాచకపుస్తకాల్లో ఇంకా చదువుతున్నాం. ఈ రకంగా వివిధ మనస్తత్వాలక్రింద రచయితలను వర్గీకరించడమనేది, విప్ల వం యెడల ఆ రచయితల దృక్పథ మేమిటనే ప్రధాన సమస్యను మరుగు పరుస్తుంది. ఇంతటితో ఈ తప్పుడు సాంఘికతత్వం 'ఆత్మసంతృప్తి చెందిన తలతిక్క'గా తేలిపోతుంది.

ఈ తలతిక్క సాంఘికవాదులు తమ వాఙ్మయ చరిత్రల్లో గొప్ప గొప్ప రచ యితల గ్రంథాలన్నిటినీ నిర్దాక్షిణ్యంగా నీచంగా విమర్శించారు. పుష్కిన్, గొగోల్, టాల్‌స్టాయిలకు ఉన్నతవర్గాల ఆంతరంగిక సమస్యలతోను, ఉన్నత వర్గాలవారు పెట్టుబడిదార్లుగా మారడం తోను, వారి ఆర్థిక పతనంతోను ముడి పెట్టారు షేక్స్‌పియర్, మొలేర్, గోథే లను గూర్చి కూడా అలాగే వ్రాశారు. ఈ పిచ్చివిమర్శలు మానవజాతియొక్క కళాచరిత్రనే మలినంచేస్తున్నాయి. కాని లెనిన్ వర్గ దృక్పధాన్ని బట్టిచూస్తే, కళాచరిత్రలోని ప్రతి ఉత్తమ కళా ఖండమూ మన పూర్వసంస్కృతిలోని ప్రజాస్వామిక సోషలిస్టు శక్తులకు సంబంధించే వున్నదని తెలుస్తుంది. కళా ఖండాల్లోని చారిత్రక వస్తువును ఎలా నిర్ధారణచెయ్యాలో, వాటిలోని నిర్జీవ మైన వస్తువునుంచి సజీవశక్తిని ఎలా వేరు చెయ్యాలో అందులో ఏది గత జానిన చరిత్రకు చిహ్నమో ఏది భవిష్య త్తుకు బాటలు తీర్చేదో తేల్చి ఎలా నిర్ణ యించాలో-మనకు లెనినిజంనేర్పుతుంది.

ఈ స్పష్టమైన విమర్శా ధోరణిలోనే నిజమైన వర్గదృక్పథం వుంది.

తలతిక్క సాంఘిక వాదులు చేసే మరోపెద్ద తప్పు ఏమిటో ఇక్కడ పరిశీలిద్దాం. వర్గాలను గురించీ సాహిత్యాన్ని గురించీ తెగవాగే వాళ్ళకు వర్గపోరాటాన్ని గురించి ఏమీ తెలియదు. నిజానికి వాళ్ళు వర్గపోరాటాన్ని సోషలిజం నుంచికూడా విడదీస్తున్నారు. ఈతలతిక్కసాంఘికవాదుల తప్పులన్నిటికీ మూలకారణంబూర్జువామెన్షివిక్కుల వర్గదృక్పథమే కాని, లెనినిస్టు దృక్పథం కాదు.

వాస్తవానికి ఈ వాఙ్మయ చరిత్రకారుల ప్రధానమైన ధోరణి యేమిటి? ఏ పెట్టుబడిదార్లనో, ప్రభువులనో పట్టుకొని, వాళ్ళతో షేక్స్పియరు, బెల్జాక్‌ల రచనలను ముడిపెట్టడం. ఈ తలతిక్కసాంఘికవాదుల దృష్టితో చూస్తే ప్రపంచ కళా చరిత్ర అంతా ఎరకోసం. తమలో తాము తన్నుకొనే రకరకాల రాబందుల (దోపిడీగాంద్ర) చిలిపి కజ్జాలక్రింద తేలిపోతుంది. వర్గపోరాటమంతా ఇదేనా? చారిత్రకంగా ప్రతి యుగంలోనూ ఉండే వర్గవైరుధ్యాలు ఏమయినాయి? కలవారికీ లేనివారికీ జరిగే నిరంతర పోరాటం ఏమయిపోయింది? ప్రజలేమయినారు? వాళ్ళను ఈ ప్రశ్నలన్నీ వేసి లాభంలేదు వాళ్ళ చారిత్రక దృక్పథంలో మీకిలాంటివేమీ కనిపించవు వాళ్ళకు చేత నయిందల్లా ఏమిటంటే, 'యువరక్తం' 'అభ్యుదయం' 'అరుణోదయం' మొదలైన పట్టిమాటలుపట్టుకొని కీర్తించడంమాత్రమే. ఇంత గట్టిగా పనిచేసి వాళ్ళు తేల్చిన పర్యవసానం ఏమంటే-మనకళల నన్నిటినీ ఏ గుప్పెడుమంది ఉన్నత వర్గాల వారి సొంత ఆస్తోచేసి పారేసారు. పెట్టుబడి దార్లయిన భూస్వాములకు పుష్కిన్‌నూ, మధ్యరకం ఉన్నత వర్గాలకు గొగేల్‌నూ అంకితం చేశారు.

మన పురాతన కళాచరిత్ర అంతటిలోనూ ప్రజా దృక్పథాన్ని చిత్రించిన కళాకారుడొక్కడూలేడని వాళ్ళమతం. ఇది కొంతవరకు నిజమే. కాని దీనికి ప్రజా దృక్పథం యొక్క ప్రభావం లేకుండానే మన కళాసాహిత్యాలు పెంపొందాయని అర్థంకాదు. ఈ కృతక మార్క్సిస్టులకంటే లెనినుకు సల్టికోవ్ షెద్రిన్ చాలాదగ్గిరవాడు. షెద్రిన్ చెప్పిన మాటలు చూడండి. "మంచి చెడ్డలనే రెండు స్పష్టమైన శక్తులు అలా వుండగా, వాటికి తోడు ఒకానొక ప్రభావాన్ని వెదజిమ్మే ఒకఅజ్ఞాతశక్తి వుంది. రచయిత వస్తువును ఉన్నదున్నట్లుగా చిత్రించాలని ఎంతప్రయత్నించినా ఈ ప్రభావంలోపడక తప్పదు. కాని ఎవ్వరూ ఈ ప్రభావాన్ని గురించి చెప్పరు. అందరూ దీన్ని అధిగమించినట్లే కనిపిస్తారు. కాని యీ అధిగమించామనేది మాత్రం వట్టి భ్రమ. నిజానికి ఈ అజ్ఞాత శక్తిని రచయిత ఎప్పుడూ మరచిపోలేదు ఈ అజ్ఞాత శక్తిలోనే, నిత్యదరిద్రంలో జీవితం వెళ్ళబుచ్చుకొంటున్న మానవుడు దాగివున్నాడు. అతనికి ఈ దాగి వుండడమేనా? లేక ప్రత్యేక జీవితమంటూ వున్నదా? అంటే నా ఉద్దేశం - అతను

ఎక్కువ భాగం దాగేవున్నప్పటికీ అత నికి కొంతవరకు ప్రత్యేక జీవితం వుందని."

ఈ "నిత్యదరిద్రంతో జీవితం వెళ్ళ బుచ్చుకొంటున్న మానవుడు" రైతు. ఈ వింత మనిషిని లెబియర్ ఫ్రెంచి గ్రామీణ జీవితంలో సందర్శించాడు. దుస్తుల్లో తప్పితే రాజుకూ రైతుకూ తేడా లేదని మాంటేగ్ వ్రాశాడు. ఇలాంటప్పుడు రైతుయొక్క, కూలీయొక్క సామ్రాజ్యవాద యుద్ధంనుంచి తిరిగి వస్తున్న సైనికునియొక్క ప్రభావం లేకుండానే మన సాహిత్యం పెంపొందిందని ఎవరు చెప్పగలరు? 19 వ శతాబ్దపు రచయితలనూ విమర్శకులనూ అనాడు దాస్యంలో మగ్గుతున్న రైతులనుంచి వేరుచెయ్యడానికి తలతిక్క సాంఘిక వాదులు చేసిన ప్రయత్నాలనన్నిటినీ లెనిన్ ఖండించాడు. టాల్‌స్టాయిని గూర్చి లెనిన్ ఇచ్చిన విమర్శను బట్టి, ఉన్నత వర్గాల నుంచి వచ్చిన ఆ ఉత్తమ రచయితలోని అవకతవకలన్నీ ప్రజల్లోని వైరుధ్యాలనే ప్రతిబింబించాయని తెలుసుకున్నాం. కళలు ప్రజా జీవితంలోనే వేరూని వుంటాయనీ, ఎప్పుడయితే కళాకారులు ప్రజా జీవితంతో సంబంధం పోయి పరిపాలక వర్గాలకు భావదాస్యం చేస్తారో అప్పుడే కళలు క్షీణిస్తాయనీ 18 వ శతాబ్దంలోనే వికో, వింకిల్‌మన్, ఫెర్గూసన్ మొదలైన ప్రసిద్ధ రచయితలు చెప్పారు. తర్వాత మార్క్సు కూడా ఈ అభిప్రాయమే వెలిబుచ్చాడు. పూర్వకాలంలోని అభ్యుదయ దృష్టిగల రచయితలందరూ ఇదే దృష్టితో వున్నారు. ఈ దృక్పథమే గొగేల్‌కు వ్రాసిన లేఖల్లో బెలిన్‌స్కీని ఉత్తేజపరచింది. ఈ దృక్పథమే టాల్‌స్టాయిని గూర్చిన లెనిన్ అభిప్రాయానికి పునాది. క్లారా జెట్కిన్‌కు వ్రాసిన ఉత్తరంలో లెనిన్ ఇలాచెప్పాడు. కళ ప్రజలకు చెందింది. అది శ్రామిక జీవితంలోకి చొచ్చుకు పోవాలి. వారికి అందుబాటులో ఉండి, వారి ప్రేమాదరాలను చూరగొనాలి."

తమపై పెత్తనం సాగిస్తూ తమను దాస్యంలోపెట్టే పాలక వర్గ తత్వానికీ, మత మౌఢ్యానికీ, క్రౌర్యానికీ, పశు ప్రవర్తనకూ వ్యతిరేకంగా పోరాడే ప్రజల మనస్తత్వాన్ని చిత్రించడమే సాహిత్యంలో వర్గపోరాటం. ఈ వర్గదృక్పథంతో ప్రపంచ కళాచరిత్రను సమీక్షిస్తే అర లరలుగా విడదీసి దేనికది కేటాయించి పారెయ్యడం జరగదు. ఈ దృక్పథంతో మన కళా సంప్రదాయాన్నీ, కళా విశిష్టతనూ అర్థం చేసుకోవచ్చు. మన కళలలోని లోపాలను పతన దశలను, వైరుధ్యాలను స్పష్టంగా తెలుసుకోవచ్చు. వాటిని అనాటి వర్గసంబంధాలతోనూ శ్రామిక వర్గ పోరాటంతోనూ సమన్వయించుకొనినిర్ధారణచెయ్యవచ్చు.

మార్క్సిజం ముసుగు వేసుకున్న 'సాంఘిక తత్వానికీ' లెనిన్‌కూ ఏమీ సంబంధంలేదు అది బూర్జువా దృక్పథము. అది బెలిన్‌స్కీ, చెర్నిషేవిస్కీ, దోబ్రల్యుబోవ్ మొదలైన రష్యన్ విమర్శకుల ప్రజాస్వామిక సంప్రదాయానికి కూడా విరుద్ధం. అడుగడుగూ మన

విప్లవాన్ని ముందుకు నడిపిన నిర్మాణాత్మకమైన మార్క్సిజానికీ, పెద్దపెద్ద మాటల్తో ఇప్పటికి గూడా మన సాహిత్యాన్ని మలిన పరుస్తున్న మార్క్సిస్టు వాదస్తానికీఏమీసంబంధంలేదు. సాహిత్య విమర్శలో మనం వెనుకబడి ఉన్నా మనవచ్చు. ఏమైనా అనవచ్చు. కాని నిజం నిజమే. మార్క్సిస్టు వాదస్తం వేరు; మార్క్సిజంవేరు. మార్క్సిజం సజీవమైన, విస్తృతమైన, నిర్మాణాత్మకమైన శక్తి; అది గతితార్కిక విప్లవ దృష్టితో పునీతమైంది. అదే లెనినిజం: సాహిత్య విమర్శ కదే గీటురాయి:

('లిటరేచర్ అండ్ మార్క్సిజం'నుంచి)



# అశ్రుమూర్తి

## శ్రీ ముట్నూరి సంగమేశం

ఆతడతిదీను డన్నార్తు డర్ధనగ్ను
డతికృశాంగుడు ననవరతాశ్రుమూర్తి
వెడలిపో శక్తిదాలమి విడువకచట
నిలచె ప్రాణమ్ము లొండు రెండలసి సొలసి

ఆతడొకనాడు కర్షకతాత - దాత
ధనిక సంతతి పెంచి నిల్పిన ఘనుండు
ప్రభుల భోగాల కాయువుపట్టు - కాని
వానికిప్పుడు నా యనువారులేరు

రక్తమాంసాలు చిలికి సంరక్షచేసి
ప్రకృతి నర్చించి చేకొన్న ఫలమొకింత
యితరులొడిచిన నోరెత్త నెరుగనట్టి
సాత్వికుడు వీడు క్షుత్పిపాసాపరుండు

వంగిమ్రొక్కుటకే అలవాటుపడిన
వీని వెన్నెముక్క కృశించి గూనువోయె
హాయి నిద్రించుటెరుగని యక్షియుగము
మిగిలె నశ్రుల నర్ధ నిమీలితముగ

# విజయం

## శ్రీమతి 'మణిమాల'

"అత్తయ్యా! ........" "ఆఁ వస్తున్నా" అత్తయ్య పెరట్లోనుంచి తిన్నగ వంటఇంటికివచ్చింది. అక్కడ ఎవరూలేరు. అప్పుడే వంట పూర్తి అయింది. బొగ్గుల కుంపట్లో పాలు కాగుతూవున్నవి. వస్తువులన్నీ తీర్చి దిద్దినట్టు అమర్చబడివున్నాయి గది శుభ్రపరచబడింది "అహల్యా!" అని పిలుస్తూ హాలులోకివచ్చింది. "ఓహో! ముస్తాబయ్యారూ? మళ్ళీ ఎక్కడికండీ తమ ప్రయాణం? ...."

"....ఫ్యాక్టరీ కార్మికుల విషయం మాట్లాడడానికి వెళ్ళాలి అత్తయ్యా..." అంది అహల్య. ఆగ్రహంతో అట్టే విలబడిపోయింది అత్తగారు. "వీళ్ళ కోసమేగదూ మీ కొడుకింత ప్రయాస పడటం?" అన్నది మరల అహల్య. "అమ్మా! నేనూ వస్తానే" అంటూ ఆరేళ్ళ బాలుడు ఇంటిలోకి వచ్చాడు. పలకా, పుస్తకాల్ని బల్లమీద పడేసి. "అమ్మా! నన్ను తీసికెళ్ళవూ" అని తల్లికాళ్ళను చిట్టిచేతులతో పెనవేసు కొన్నాడు. "అప్పుడే వచ్చేశావుట్రా! అయిదు ఘంటలుకొట్టిందే" అంటూ అహల్య కొడుకు క్రాపు వెంట్రుకలను సర్దింది. "ఎప్పుడో కొట్టేశారే! ఊహూఁ నిన్నువిడువను. నన్ను తీసికెళ్ళాలి.. " మరింత గట్టిగా పట్టుకున్నాడు తల్లిని కుర్రవాడు.

అత్త: "రోజా మహిళాసంఘం, ఆ సంఘం, యీ సంఘం అంటూ మధ్యాహ్నం వెళ్ళేదానివి, ఈరోజు సాయంకాలం బయలుదేరావు ఇఁక అర్ధరాత్రి కూడా బయలుదేరుతావన్న మాటే. అంతేగా? ఆడదాని కింత స్వతంత్రమిస్తే ఆటవిడుపుగాక మరే మౌతుందని....? లోకులేమనుకుంటారే? నీకూ, వాడికీ సిగ్గన్నమాట లేకపోయె మరి.... కాని ..."

అహల్య:" అత్తయ్యా! అలాఅనకు నన్ను . ఈ రోజు ముఖ్యమైన పని వుంది. వెళ్ళక తప్పదు. దబ్బున వచ్చేస్తా...."

అత్తయ్య: "చాల చక్కగా వుందే యీ నాటకం.... ఈ కరువుకాటకాల్లో పనిపాట్లు వదిలేసి నిశ్చింతగా జైలులో కూచున్నాడు కొడుకు. కోడలేమో ఊరి వాళ్ళ నుద్ధరిస్తానంటూ ఊరేగుతుంది రోజూ...."

అర్ధోక్తిలో అడ్డువచ్చింది "అత్తయ్యా ఏం మాటలివి?..."

"ఇఁక ఈ సంసారాన్ని మెడకు కట్టుకొని ఏడ్వాలిసింది యీ ముసలి ముండేకదూ! అబ్బ! ఎవరిక్కావాలి ఈ వెధవ సంసారం!" అంటూ అత్త చేతనున్న కూరల బుట్టను క్రిందపడ వేసింది.

అహల్య కోపాన్ని శాంతించు
న్నది "అత్తయ్యా! దిక్కులేనివాళ్లు!
పం! వాళ్ళ నాయకులేమో జెయిల్లో
న్నారు. వాళ్ళ కుటుంబాలు పనిపాట్లు
క పస్తుపడుతున్నారు. నా చేతనైనంత
దుకోవద్దూ." "అవునే నీకుటుంబం
గాలిపోతుంటే ఆదుకొనేవాళ్ళేమోలేరు,
ని నీవుమాత్రం ఊరివాళ్ళ కుటుం
ల్ని ఉద్ధరించటాని కెళ్లాలిగదూ
ప్పు దగ్గరనుంచి సమస్తమూ నాల్గింత
చ్చి కొనాల్సి వచ్చె ఉన్నకాస్తసొమ్మూ
గలెట్టాశాం, అప్పుల పాలయి
తున్నాం. "నీవా" అని పలుకరించే
ళ్ళేమో లేరు. కాని నీవుమాత్రం
ఊరివాళ్ళ నుద్ధరించటానికి..."
అత్తయ్యా! మనకు కాస్తో కూస్తో తిన
నికి ఉంది. కొంత భూమీ పుట్రా
న్నాయి, ఇంకా కొంత నగలున్నాయి
మ్ముకోటానికి. పాపం! వాళ్ళు ఇంటి
పాదీ ప్రొద్దస్తమానం కూలినాలి
సుకొన్న నాడే అర్థకడుపు అన్నానికి
చుకోలేదే ఇప్పుడు వాళ్ళవస్థ ఏం
ప్పను? 'జీతం కరువుబత్తెం ఎక్కువ
య్యండి అన్నందుకు వందల మందిని
నినుండి తోసేశారు మరొక ప్రక్క
ంగవ్యాపార్లు వాళ్ళ పొట్ట కొట్టుతు
్నరు. వాళ్ళ నాయకుల్ని జైలులో
దేశారు. అబ్బ" అత్త అడ్డు
చ్చింది "ఇక చాల్లే నీమాటలు ...ఏమ
్నవూ! అహల్యా! ఈ రోజు, భూమి
మ్ముతానంటావు....రేపు ఇల్లు తగ
ట్టేస్తానంటావు నాకు మరొక కొడు
న్నాడు గదా! ముష్టిఎత్తుకొని జీవించా
నేనా. నీ ఇష్టం...." అహల్య చిరు
నవ్వు నవ్వింది. "అత్తయ్యా! అంత
ఖర్మేమి. నా మరదికి! నిక్షేపంలాగు
రెండేళ్ళలో డాక్టరవుతాడు! మనలాంటి
వాళ్ళనెంతమందినైనా పోషిస్తాడు....
కాని...." బూట్సు చప్పుడు—మాటలు
అట్టె ఆగిపోయాయి "అమ్మా! ఏమే
ఈ గోల! వదినా! మీ మాటలు వీధి
లోకి వినిపిస్తున్నాయి" అంటూ లోనికి
వచ్చాడు మరిది. ఇద్దరి ముఖాల్నీ
చూచాడు

అత్త—"మీఅన్నయ్యచేసిన గోలే
ఇది. "తాచెడ్డకోతి వనమెల్ల చెరిచింది"
అన్నట్టే చేశాడురా మీ అన్నయ్య!
ఇదిగో! చూడు! ఊరివాళ్ళ నుద్ధరిస్తా
నంటూ మీవదినే...." తల్లివి చురచుర
చూచాడు కొడుకు. "అబ్బాయీ! నీవు
ఊరుకోనాన్నా, మామాటకుఅడ్డురాకు.
అత్తయ్యా! 'పతి పతితుడైనాసరే,'
పతి అడుగులజాడలో, మెలిగే సతియే
సహధర్మచారిణి" అనిపెద్దలుమీరే కదూ
బోధించేది, అందులో నాపతి పతితుడు
గాదు. ప్రజాసేవకుడు! దేశభక్తుడు!
అలాంటి భర్తను అనుసరించాలంటారా
లేదా? మీరే చెప్పండి." అహల్యను
పూర్తిగా మాటలాడనివ్వలేదు అత్త..
"అహల్యా! ఎన్ని ఇచ్చకాలు నేర్చావే
నచ్చచెప్పటానికి. పెద్ద చదువులువద్దురా
అన్నయ్యా అని ఎంత బ్రతిమలాడాను.
ఏంలాభం? సీతంద్రికి సీభర్తకూడా,
తోడు....

మరది.—అమ్మా! ఇంక చాల్లేవే
నీగోల. అలాంటి అన్నయ్యనూ, వది
నెనూ, ఏమనకు!పాపంచుట్టుకొంటుంది.
వాళ్ళేదో దేశసేవ చేసుకొంటున్నారు!

వాళ్ళదారిని వాళ్ళనిపోనివ్వు! నీ పూజా పునస్కారాలకు అడ్డం వచ్చారటే వాళ్ళు"

"ఒరే! గోపాల్! నువ్వూ వాళ్ళలోని వాడవేకదూ ఎందుకొచ్చిందీ గొడవ! ఈపాడుసంసారాన్ని... (అర్థోక్తిలోఆపి) "ఒరే రారా 'చిట్టిబాబూ! కాళ్ళుకడుక్కో! కొ_స్త మిఠాయి తిందువుగాని" అని మనుమని చేయిపట్టుకో బోయింది. "ఊహూ! నన్నుముట్టుకోకే బామ్మా. నాన్ననూ, అమ్మనూ తిట్టావుగదూ" అని అంటూ భామ్మ చేతిని తోసేస్తూ తల్లి చేతిని మరింత గట్టిగ పట్టు కున్నాడు బామ్మ నిర్ఘాంత పోయింది.

"ఒరే బాబూ! నేలేనిదే మీనాన్న పక్కడనుంచి ఊడిపడ్డాడురా! వాడేమో మీనాన్నా, నేను మాత్రం పరాయిదాన్ని కదూ"....కళ్ళుతుడుచుకుంది. అహల్య తన కొడుకు చేతిని తోసేసింది. "ఒరే! చిట్టిబాబూ బామ్మనేమన్నావూ. పో! నన్ను ముట్టుకోకు" అంది. తల్లినీ, బామ్మనూ చూస్తూ ఒక్క క్షణం అట్టే నిలబడిపోయాడు. మరుక్షణమే చటుక్కున గంతువేసి బామ్మను గట్టిగ కౌగి లించుకున్నాడు. భ్యామ్మ కంటినీటిబొట్టు మనుమని వెంట్రుకలమీద పడింది. ఎత్తుకుని ముద్దెట్టుకొంది...."అబ్బాయీ నీవెప్పుడొస్తావు" అని అడిగింది అహల్య. "నీవు వెళ్ళు వదినా! నాపని చేసుకొనివస్తా". "ఆలస్యమయింది. దబ్బున వెళ్ళు....ఒరే బాబూ! ఈరోజు నీవు గోలచేయకపోతే రేపు ఎగ్జి బిషన్‌కు ...ఏం....బామ్మకు చెప్పకురా, ఏం" "అమ్మా! నాకు కాఫీ యివ్వు" అంటూ తల్లిని, కుర్రవాణ్ణి లోనికితీసుక వెళ్లాడు గోపాల్.

* * *

వీధి అంత విశాలంగా లేదు కాని, అంత ఇరుకయినది కాదు. వీధి కిరు ప్రక్కలాకొట్లే. రెండుచివరలా జనులు కిటకిట లాడుతున్నారు. వీధిలోమాత్రం అంత క్రిక్కిరిసి లేరు. అన్ని కొట్లూ మూసి వున్నాయి. కొన్ని పెద్దవి, సరుకులను నిలవ పెట్టడానికీ, క్రయ విక్రయాలకు పనికి వచ్చేవి. మరి కొన్ని చిన్నవి, సైకిల్సు తదితర సామాన్లు రిపేర్ చేయటానికి ఉపయోగ పడేవి. వీధి కిరుప్రక్కలా తలుపుల మీది నంబర్లను పరకిస్తూ అహల్య నెమ్మదిగా నడవ సాగింది. ఆదిత్యుడు అస్తమాద్రి వైపుకు అడుగుపై అడుగు వేస్తూ జారి పోతున్నాడు. రెండు వైపులా మురికి కాలువలు, చెత్త చెదారం దుర్గంధ మయం.కుండలు, చట్లు, చింపిరిచాపలు, మురికి బట్టలు, అకాలువవద్దే వండు కుంటున్నారు కొందరుస్త్రీలు. మొగవాళ్లు పేకాట, చదరంగం ఆడు కుంటున్నారు. పిల్లలు కొందరు పేలు చూసుకొంటూ, మరికొందరు ఆడుకొంటున్నారు కొన్ని కొట్లకు వసారా లున్నాయి సాధారణంగా పెద్దపెద్ద వసారాలు కటకటాలు బిగించి తాళంవేసివున్నాయి. కొన్నిటికి అరుగులు మాత్రమే వున్నాయి. (పై కప్పులేని వన్నమాట.) ఈ అరుగుల మీద కొన్ని చిన్న వ సా రా ల్లోనూ అనేక కాపురా లున్నాయి. అందులో ఒకచిన్న వసారాగుమ్మంవద్దఏడెనిమిది ఏళ్ళపిల్లలిద్దరు ఏమో మాట్లాడు కొంటు న్నారు, వాళ్ళ మాటలుఅహల్యను ఆక

క్షించాయి. ఒక ప్రక్కగా నిలబడి వినింది "లచ్చీ! మాఇంటికి రావే.ఆడుకొందాం. ఈరోజు మాఇల్లు ఎంతపెద్దదను కొన్నావు? ప్రొద్దున్నుండి ఎంతమంది ఆడుకొంటున్నాం ...దా...." "అమ్మా! ఎంకింటి కెళ్తానే" ఇద్దరూ భుజాలమీద చేతులేసుకొని ఆహ్లాదంగా వెళ్ళిపోయారు. "చింపిరితలలు చినుగుబట్టలు. చిక్కిన దేహాలు! పాపం!.... "ఈరోజు మా ఇల్లెంత పెద్ద దనుకొన్నావు" అహల్య కేమీ బోధపడలేదు వాళ్ళ వెంటనే నడవ సాగింది కొంతదూరంలో ఒక పెద్ద వసారావద్ద ఆగారు ఆ పిల్లలు. కొట్టు మాత్రమే తాళం వేసివుంది. వసారాలోని ఒకవైపున కాపురం. మరొక చివర అనేక మంది పిల్లలు ఆడుకొంటూ పాడుకొంటున్నారు "ఈరోజు ఆదివారం. శలవన్నమాట. అంచేతనే పాపం! వాళ్ల ఇల్లు పెద్దదయిందీ ...రేపు చిన్నదీ... అహల్య కళ్లనుండి రెండు అశ్రువులు రాలాయి. ఈ దౌర్భాగ్య దృశ్యాన్నీ, ఈ నాటి కింకనూ సర్వసౌకర్యాలతో కూడుకొన్న తనకుటుంబాన్నీ పోల్చుకొనింది. "నీ కుటుంబం కూలిపోతుంటే ......" అన్న అత్తిమాటలు గుర్తుకు తెచ్చుకొంటూ వీధి చివరిదాక వెళ్ళింది. చిట్ట చివరన ఒక దేవాలయం కళ్ళబడింది. గర్భగుడిలో, ఆలయమంతా సహస్ర దీపాలు. పచ్చపచ్చని తోరణాలు, గంధ పుష్ప ఫలాదులు, ఘణఘణ గంటలు, ఆహా! ఏమి వైభవం!....ఆలయావరణంలో, ధ్వజస్థంభంవద్దనూ "రామా! శ్రీరామా! గుణాభిరామా.........దుష్టశిక్షణ ...శిష్టపరిపాలకా!.........మమ్మురక్షించు తండ్రీ.." భక్తులు సాగిలపడి నమస్కరిస్తున్నారు. వీధిలో అటు ఇటు వెళ్లతుంటే వర్తకులు మున్నగువారు, గుడిగుమ్మం వద్ద నిలిచే వారు "సర్వాపరాధాల్ని క్షమించి రక్షించు తండ్రీ; ...." అంటూ చెప్పులు విడిచి చెంపలు వాయించుకొనేవాళ్ళు కొందరు. మరికొందరు నోటిలోనే ఏమేమో అనుకొంటూ మ్రొక్కేవాళ్ళు "వీళ్ళకువ్యాపారమే వుందో .... లేక .... వ్యాజ్యమే ఉందో కోర్టులో-ఎవరికి తెలుస్తుంది.

"ఆహా! ఎంత మహానుభావుడు భక్తశివరాం! సర్వస్వం దేవుని కర్పించి వేశాడు" అనుకొంటూ, పోతున్నారు కొందరు. "తండ్రీ! ధర్మంచెయ్యండి. కళ్ళులేని కబోదిని"...."బాబూ కాళ్ళు లేవు కానీపడేయండి". "ఆకలి! ఆకలి" . "ఛీ ఎక్కడా ఈ వెధవమూకే...." వీళ్ళనందర్నీ . ? ముఖ ద్వారంమీద శివరాం పేరు పెద్దపెద్ద అక్షరాలతో మెరసి పోతూంది అహల్య చుట్టూ పరికిస్తూ మరల దేవాలయంలోకి దృష్టిని మరలించింది. "అబ్బ! బయటెంత దారుణ దారిద్ర్యం లోపల ఎంత వైభోగం!" నిట్టూర్పు విడుస్తూ వచ్చిన దారే నడవ సాగింది.

11 నంబరు కొట్టు! కొట్టుప్రక్కన్నే మెట్లగది! గుమ్మంలో లక్ష్మమ్మ వాడిన వంకాయల్ని, క్యాబేజీఆకుల్ని తరుగుతూ వుంది. "అమ్మా వాడి వరుగైన వంకాయల్ని ఎవరిచ్చారమ్మా నీకు" అని అడిగింది అహల్య. పరధ్యానంతో కూరల్ని తరుగుతున్న స్త్రీ రిచ్చపడి

తలఎత్తిచూచిందిఅహల్యను. "వాడనీ, తుళ్ళనీ డబ్బిచ్చి కొనాల్సిందే. ఊరికే ఎవరిస్తారమ్మా. అల్లదిగో ఆదివరనే మార్కెట్టు! వాడిపోయిన వాటిని పారేసుకోరు; చౌకగ అమ్ముకుంటారు. మాలాంటివాళ్ళు కొనుక్కొంటాము. ఒక అణా ఇచ్చి కొన్నా ఈ కూరల్ని" అంది. దువ్విన జుట్టు. నొసట్లోని బొట్టు చినిగినా శుభ్రమైన బట్ట. ముచ్చటైన మాటలు. కాలువలవద్ద వండు కొంటున్న స్త్రీలకు ఈవిడకు ఎంత తేడా!. ఇంతలో షుమారు 16 ఏళ్ళ కుర్రవాడు పరుగెత్తుకు వచ్చాడు. దాపునే ఉన్న చేటలో బియ్యాన్ని కుమ్మరిస్తూ "అర్ధశేరే ఇచ్చారే రేషన్" అన్నాడు. "ఇంకా నయంరా. అసలే లేదనకుండ అర్ధశేరైన ఇచ్చారు! అంతకన్న కొనడానికిమాత్రం డబ్బు ......... ...." అహల్య మరింత దగ్గరకు వచ్చింది. "వీరయ్యా!" తలెత్తిచూశాడు "నమస్కారమండీ! .. అమ్మా! అహల్యాదేవిగారిని నిలబెట్టి..." చటుక్కున లేచింది లక్షమ్మ. "అయ్యో తల్లీ! క్షమించండి. మిమ్మల్నెరక్క...." "లక్ష్మమ్మా! విచారపడకు. నన్నెపుడూ చూడలేదుకూడాను. అందులో నీవు దుఃఖంలో ......" అర్ధోక్తిలో ఆపింది అహల్య "ఔనండీ! యమభటుల్లాగ ప్రొద్దున్నే ఆయన్ని పట్టుకుపోయారండీ. ....." మాటాడలేకపోయింది. కళ్ళవెంబడి నీరు కారిపోతోంది. "అవునుమరి! పదిరోజులనాడు పొట్టగొట్టే దొంగల్ని పట్టుకొన్నాడు రామయ్య కూడాను. దొంగల్నేమో విచ్చలవిడిగా విడిచేశారు. దొంగల్ని పట్టుకున్నవాళ్ళని బంధించివేస్తున్నారు. ఈ అమానుషత్వం ఎంతకాలముంటుంది ?...." ఇంతలో మెట్లగదినుంచి పిల్లఏడ్చే శబ్దం వినవచ్చింది......... "వీరయ్యా! నీ చెల్లిగదూ ఏడ్చేది...." అంటూ అహల్య గదిలోకి వెళ్ళింది. మెట్లవెనక భాగంలో మూట ముల్లెలు, వంట పాత్రలు—అసలు రామయ్య సంసారమంతా అక్కడనే ఇమిడిఉంది. ఏడెనిమిదేళ్ళ అమ్మాయి ఏడుస్తూ అక్కడనే పడుకొనివుంది. అహల్య పిల్ల ఒళ్ళు ముట్టిచూచింది. దగ్గరకూర్చొని పిల్ల ముఖాన్ని, తలనూ, తడువుతూ కళ్ళు తుడుచుకొన్నది అహల్య అనురాగాన్ని ఆదరణల్ని వీక్షిస్తున్న లక్ష్మమ్మ అట్టే చతికిలబడి భోరున ఏడ్చింది. పిల్ల భయపడి లేచి అహల్యను చూచింది. పరుగెత్తి తల్లిఒళ్లో తలబెట్టి ఏడ్వసాగింది "అమ్మా! ఎందుకే ఏడుస్తావు ఊరుకో నేనులేనూ ..." అనిమందలించాడువీరయ్య అహల్యకళ్ళుమెరిశాయి. "లక్ష్మమ్మా! ఏడవకు ఊరుకో నీకీలాంటి కొడుకున్నాడు. మేమున్నాం; రామయ్య జెయిలులో ఎంతోకాలం ఉండడు. ఉండనివ్వం కూడాను; పిల్లలను ఓదార్చు" అంటూఊరడించింది అహల్య.

అహల్య :—వీరయ్యా! చెల్లి కెంతకాలంగా జ్వరం తగులుతూంది? ఆవ్పత్రికి తీసికెళ్లారా?

వీరయ్య .—నాలుగురోజులుగానండీ? నాన్నే తీసికెళ్ళారు నిన్న. కాని, ఆ మందులు పట్టి నీళ్ళేనటండీ!

అహల్య :—అన్నిటికీ వచ్చిన హైట

మందులకీ వచ్చింది కరువు! మన డాక్టర్ వద్దకు తీసికెళ్ళు, మంచిమందు లిస్తారు. ఏం....ఆలస్యం చేయకు మరి!

వీరయ్య: నాన్న అరెస్టు అయ్యా డని ప్రొద్దున్నుండి ఒకే ఏడ్పుండి అంచేత జ్వరం ఎక్కువయింది. చెల్లి అంటే నాన్నకు మహాగారాబం...."

అహల్య:—లక్ష్మమ్మా! మీరీవీధి కెప్పుడు వచ్చారు కాపురం?

లక్ష్మమ్మ:—పదిహేను రోజులయ్యా యండి. ఫ్యాక్టరీనుండి తరిమి మూడు నెలలు అయ్యాయి కదూ! రెండునెల లగా అద్దె ఇవ్వలేక పోయాం. ఇంటి సొంతగాడు మా చెంబు తప్పేలాల్ని లాక్కొని పిల్లా జల్లాతో తరిమి వేశాడు. ఈకాస్తచోటికి 3రూ అద్దె. ఈకొట్టు అబ్బాయి నౌకరీ చేసే వాళ్ళది. అల్లదిగో సత్యం కాపురం ఆ వసారాలో....ఈకాస్త చోటూ దొరకక ఎంత కష్టపడ్డాం, వాళ్ళ ఇంటిపంచనా, నీళ్ళింటి పంచనా పదిరోజులు గడిపాము. మాకేకాదు తల్లీ ఈఅగచాట్లు పనిపోయిన వాళ్ళందరికీకూడాను.

" ..." ఎవరో వస్తున్న చప్పుడు. "లక్ష్మమ్మ! "...."ఓ అహల్యా దేవి గారా? వచ్చారా!...." "అ! వచ్చాను సత్యం! దబ్బునరా" అన్నది అహల్య. 'నమస్కారమండీ!' అంటూ లోనికి వచ్చాడుసత్యం. మరినలుగురుకూడా వచ్చారు. వీరయ్యచటుక్కునలేచిఎక్కడికో వెళ్ళిపోయాడు. కాని ఒకటి రెండు నిమిషాల్లో మరి కొందర్ని వెంటబెట్టుకొని వచ్చాడు. లక్ష్మమ్మ గది గుమ్మంలో కూర్చునివుంది. అందరూ ఏమేమో మాట్లాడు కొంటున్నారు. ........చటుక్కున అందరూ లేచారు. బయటికి వెళ్ళిపోయారు. అహల్య అరుగుమీదికి వచ్చినిలబడింది పూర్తిగాచీకటిపడింది. విద్యుద్దీపాలు వెలుగుతున్నాయి. కాని అంత ప్రకాశమైనవి కావు. జనులు కొందరు నెమ్మదిగా దేవాలయంవైపుకు నడుస్తున్నారు. మరి కొందరు అక్కడక్కడా గుంపులు గుంపులుగా నిలుచుని మాట్లాడుకొంటున్నారు. వీరిలో అనేకులు కార్మికసంఘాలవాళ్ళూ, విద్యార్థులూఉన్నారని గుర్తించింది అహల్య. "వీళ్ళపై ఖరిలో ఎక్కడా అలజడిగాని అయోమయంకాని కనబడటంలేదు...." అనుకుంటూ ఆలోచిస్తూంది అహల్య లక్ష్మమ్మ ఏమో చెప్పబోయింది కాని మాట్లాడవద్దని సౌంజ్ఞచేసింది. మరింత అరుగుచివరకు వచ్చినిలచింది. ప్రక్కనే కొందరు జనులు మాట్లాడు కొంటున్నారు.

ఒకరు.—ఎంతకాలమని ఓర్చుకొంటాం ఈ అన్యాయాల్ని?

మరొకరు:—ప్రభుత్వం పరాయిదైతే మాత్రం ప్రజలు పరవాళ్లా, చూడు.... అని దేవాలయం వైపుకు దృష్టిని మళ్ళించాడు.

ఇంకొకడు: ఒరే! కొండయ్యా! నీకు నిజంగా మతిపోయిందిరా! పరప్రభుత్వమంటావేమిరా!...ఈనాడు అధికారంలో వుండేది మనవాళ్ళు కాదట్రా? ప్రజలదిరాప్రభుత్వం....

2 వ వాడు:—ప్రజలది కాబట్టే ప్రజా సేవకుల్ని బంధించింది కదూ....

4 వ వాడు:—అర్థంలేని చదువు వ్యర్థ

మన్నట్టుందిరా నీవాలకం! ఇంతకాలం సంఘంలో వున్నావు! ఇక్కడికి తెల వారింది నీతెలివి తేటలు....

5వ వాడు:—రాత్రి అంతా రామాయణంవిని "సీతకురాము దేమవుతాడు" అని అడిగాడుట నీలాంటి మూఢ శిఖామణి"

2వ వాడు:—కాలేజిలో చదువుకొంటున్నాని మురిసి పోకు...

4వ వాడు:—ఈలాంటి చీవాట్లవల్ల కాస్తవున్న మతి కూడ పోతుందిరా! పెద్దన్నా! కొండయ్యా! ఈలా చూడు! ఈనాడు అధికారంలో వుండేది మన వాళ్లే! అంటే ప్రజా ప్రతినిధులేరా. కాని....ఇంకనూ వాళ్ళల్లో భూత భేతాళులు శాకినీఢాకినీ పిశాచాలు పీఠం వేసుకొని కూర్చున్నాయి. ప్రజల్ని పీల్చి పిప్పి చేస్తున్నమాట నిజమే. అయితే అన్నిటికీ అంత్యదశ అంటూ ఒకటివుంది కదూ. అలాగే వీటికీ వుందిరా. ఎంతో దూరంలో లేదు కూడాను....

జనులు అసంఖ్యాకంగా పోగవుతున్నారు. వీధి జనులతో నిండిపోతూ వుంది. అందరి గమ్యస్థానం దేవాలయం ప్రక్కనే. అహల్య దృష్టికూడా దేవాలయం వైపే .. .... భూతంలాగు నల్లని లారీ నిలుచునివుంది. జనులు చుట్టుముట్టి వున్నారు. హఠాత్తుగా అరుపులు బొబ్బలు బయలుదేరాయి. గడగడమని లారీ కదలే చప్పుడు. "పట్టండి లారీని....పట్టండి దొంగల్ని! ....మన పొట్టగొట్టి .... అబ్బ! ఎన్ని బస్తాలు రా ధాన్యం! .. ఊఁ అపండి.... చుట్టుముట్టి....ఎదుటివైపునుండి ప్రజా సమూహం ప్రవాహంలాగు తరలి వస్తూంది. దారి కడ్డంగా రాళ్ళూ రప్పలూ పేర్చుతున్నారు. 'బ్రతుకు జీవుడా' అని ప్రజల్నుండి తప్పించుకోటానికి ప్రయత్నిస్తూంది దొంగలారి. "పట్టండి! పట్టండి" అని కేకలువేస్తూ, లారీ కిరుప్రక్కలా. పోలీసులు జనులను లాఠీలలో కొట్టసాగారు జనులు ఒక్కక్షణం చెల్లాచెదరై పోయారు. మరుక్షణంలో వందలు వేలుగా మళ్ళీ లారీని చుట్టు ముట్టారు. హఠాత్తుగా లారీ చక్రాలకు పక్షవాతం తగిలింది. అవి ఏడుస్తూ భూమిలో దిగబడి పోయాయి డ్రైవర్ కదల లేదు. ఇంతలో ఒక పోలీసు ఎవరినుంచో తప్పించుకొంటూ బలంగా కొట్టి పారిపోయాడు "అయ్యో అమ్మా" అన్న కేక చెట్టులాగు క్రిందపడి పోయాడు. "హత్య! హత్య!" అన్న అరుపులు. అరుగునుంచి దూకింది అహల్య. కేకలు వస్తున్న దిక్కుకు పరుగెత్తింది. తటాలున అట్టే ఆగిపోయింది కళ్ళు తిరిగాయి. ముఖమంతా రక్తం బట్టలన్నీ రక్తం. ఒకే రక్త ప్రవాహం! మరుక్షణంలో తేరుకొని క్రింద కూర్చున్నది. మెల్లగ తలను తొడమీద పెట్టుకొంది. క్రాపు వెంట్రుకల్లోనుంచి రక్తం ధారగా కారిపోతూంది. అహల్య కళ్ళ నుండి కంటనీరు కారి కారి పోతూంది. నీళ్ళు నీళ్ళు అని కేకలు. నీళ్ళతో కంటి నీళ్ళతో ముఖాన్ని గాయాన్ని తుడుస్తూంది. ఎవరో దీపంతెచ్చారు. ముఖం వద్ద పెట్టిచూచారు. "అయ్యో నా వీరయ్యా" అంటూ చతికల పడింది. లక్షమ్మ. దీపం క్రిందపడి భగ్గునమండి

పోయింది. ఎవరో మంటను చల్లార్చారు. "అహల్యాగారూ కుఱ్ఱవాణ్ని చూడనివ్వండి" అహల్య తలెత్తి చూచింది "అబ్బ! వచ్చారూ? అన్నయ్యా" అంటూ తలను క్రిందపెట్టి తొలగి నిలబడింది. డాక్టరు పరీక్షించి గాయానికి కట్టు గట్టాడు. ఇంజక్షను ఇచ్చాడు. పొట్టమీదకూడా కొట్టారు. కాని అంత బలమైనదెబ్బ తగలలేదు. "లక్షమ్మా భయపడకు తల్లీ. నీకొడుకు బ్రతికి బల్లెంలాగుంటాడు ఈతిండిదొంగలకు" అని అంటుండగానే 'మన వీరయ్యకుజై' "రామయ్యకుజై" జయ జయ శబ్దాలు మిన్నుముట్టుచున్నాయి డాక్టరూ, మరిద్దరూ వీరయ్యను కదిలించకుండా కారువద్దకు తీసుకవచ్చారు "చెల్లీ! అహల్యగారూ, లక్ష్మమ్మ! అబ్బాయిని పట్టుక కూర్చొండి. ఆస్పత్రికి తీసికెళ్ళుతాం.... ఏం! వీరయ్యా" అని డాక్టర్ టార్చి లైటును వాని ముఖంమీద వేశాడు. వీరయ్య కళ్ళు తెరిచాడు "లారీ పట్టుబడిందా?....దొంగలు దొరికారా" అని ఆదుర్దాగా అడిగాడు. "ఆ....దొరికారు. పోలీసు బపరారి అయ్యారు. .ధాన్యాన్ని ప్రజలకు పంచిపెట్టుతున్నారు గూడాను వీరయ్యా".

వీరయ్య కళ్ళల్లో విజయానందం తొణికిసలాడి పోయింది.

"నీకు తగిన పేరే పెట్టారు, వీరయ్యా!" అని అహల్య వాని నొసటిమీద మెల్లగ తడిమింది. లక్షమ్మ కళ్ళనుండి ఆనందాశ్రువుల్లు రాలాయి. కారు కదిలింది. ప్రజల్లోనుంచి రకరకాల గొంతులు వినిపిస్తున్నాయి "ఎవరురా ఆ దొంగ?...." "మన పొట్టగొట్టి.... పోగుచేస్తున్నాడే ధనాన్ని వాడేరా! శివరాం...."ఆ! ఏమీ ఈ దేవాలయాన్ని కట్టించిన శివరామేనా?". "అహా! వాడే! ఆ మహానుభావుడే — ఫ్యాక్టరీనికూడా కట్టించాడు...." ... "అబ్బ మేకవన్నె పులిరా! దేముడు లేడూ"...... "ఆ( ఉన్నాడు నిక్షేపంలాగు, ప్రక్కనే.... అసలు ఈ ధాన్యాన్ని దాచింది దేముడి గుడిపక్క గదిలో కాదుట్రా ." "శివరాం తెలివితేటలకు సాటిలేరురా ఎవరూ . ప్రజలమధ్య మునిమాపునే కళ్ళల్లో మట్టిగొట్టి... ఆహా! ఏమి చాతుర్యం!" "వాని చాతుర్యం బుగ్గియిపోయింది చివరకు. ". "వాని పాపంపండింది."

ఎదుటివైపునుండి వచ్చిన పోలీసు సిబ్బంది ప్రజా ప్రవాహాన్ని చూస్తూ అలాగే స్తంభించి పోయింది.

"గిల్టు అక్షరాలలో "శివరాం" పేరు తళ తళమని మెరసిపోతూవుంది

కాళ్ళు విరిగి నేలలో కూరుక పోయిన లారీదిగాలుపడి చూస్తూవుంది

వీర్యయ్యకూ జై! రామయ్యకూజై స్వతంత్ర భారత్‌కి జై!

ప్రజాహృదయాన్ని ఆకాశం ప్రతిధ్వనిస్తున్నది.



# ఆరని వెలుగు

శ్రీ 'విజయ్'

రాజఠీవి నిలపాలని పొంగి
సిరాజుద్దౌలా తెల్లకోమటిని
రాజమహలులో పిలిచిననాడే
రాలేదా వొక పీడకలైనా !!
నీకళ్ళూ నాకళ్ళూ పోతే
నిలిచిన చీకటిలో నీడల్లా
ప్రాకిన పరదేశస్థుల వలలో
పడి గిలగిలలాడిన యీ దేశం
నలుబది కోటుల నాబోంట్లకు
"నాదేశం" "నాదేశం" "నాదేశం"
ఇట మిన్నంటిన కోటల బురుజులు
పరరక్తం చవిగొన్న పిశాచులు
తరలివచ్చి దాగిన గోరీలై,
నేటికి గోరీలై - మన్నంటెను
కరుళ్ళు గట్టిన బానిసత్వమూ
వరాలు నమిలే దరిద్రభారం
పరాయి ప్రభువుల పరిపాలనలో
తరాలుగా మనకందిన వరాలు....
బీద సాదలను బాధలు పెట్టను
కారణమడుగని మారణ యంత్రం
నిర్మించిన కర్మాగారంలో
ఘర్మజలం మన కర్మఫలంగా
శాసించిన పరశాసన కర్తం
కోటుజేబులో నోటు కట్టలకు
సమసామ్యంలో సాగిన కండలు
సాంతం చినిగిన బొంతలుతొడిగిన
ఎముక పోగులను వెక్కిరించినవి....
మనిషి మనిషినీ, జాతి జాతినీ
మసిజేసే మత వైషమ్యంతో
మనిషిని మనిషీ, జాతిని జాతీ
మసిజేసుకు గీచిన సరిహద్దులు
చాలక, తేలక, పొలిమేరల్లో
సాగిన వంతర్యుద్ధాలెన్నో !
నాలారక్తం, మాంసం తొడిగిన
నాదేశపు నాప్రియ సోదరుడా !
"నీలోనాకూ, నాలోనీకూ
నిత్యమైన చోటొకటి దొరకడం
జరిగిన యుద్ధాలన్నిటిలో దివి
కరిగిన జీవులకందని లక్ష్యం...
"నిన్నూ, నన్నూ, దూరంచేసిన
కులాల గోడలు కూలద్రోసుకో,
నౌఖాలీ నరకంలో పారిన
నరరక్తం నీదే నీదేనట....
"నీడబ్బూ" - "నాడబ్బు" - నశిస్తే
నిలిచే పేదరికంలో సౌఖ్యం
నీలో 'నీవూ' నాలో 'నేనూ'
చస్తేమిగిలే 'సత్యం' లాంటిది
"నాతోటను పెరిగిన సంపెంగలు
నీ నీడను పెరిగిన పాపలవే
నీగుండెకు తగిలిన ప్రతిగాయం"
నాగుండెనదగిలిన వొక ప్రళయం....

"నీవూ నేను, నేనూ నీవూ
నిత్యం వొకటేనని నీవంటే
నేపాడిన యీ పాటకు పల్లవి
నీపాటేనని నేహర్షిస్తా,
"నీకై పుట్టిన బుద్ధదేవుడూ
నీకై గిట్టిన ఝాన్సీరాణీ
నీలో, నీదేశంలో, కోరిన
ఆరని వెలు గవలోకిస్తారు."

# ప్రజా నాట్యమండలి

## శ్రీమతి పార్వతీకుమారమంగళం

"ప్రజా నాట్యమండలివారి ఆధ్వర్యం క్రిందజరిగే ఈమహాసభ-సత్వరం ఈ ఉద్యమాన్ని భారతదేశమంతటా వ్యాపింప జేయవలసిన అవసరాన్ని గుర్తిస్తున్నది. ఈ ఉద్యమాన్ని యావద్భారతం పరివ్యాప్తం చెయ్యడం ద్వారా మన నాటక రంగాన్నీ, ఇతరకళారూపాలనూ పునరుజ్జీవింప జేసి, న్యాయమైన ఆర్థిక సౌకర్యాల కోసం, ప్రగతిశీల సంస్కృతి కోసం, స్వేచ్ఛా స్వాతంత్ర్యాల కోసం పోరాటాలు సాగిస్తున్న మన ప్రజలకు ఈ కళలు ఉత్కృష్ట సాధనాలై ప్రజా జీవితానికి రూపులు దిద్దేట్టు చెయ్యాలి"

అని నాలుగేళ్ళ క్రితం, బొంబాయి ప్రజా నాట్యమండలివారు జరిపిన మహాసభలో తీర్మానించారు.

ప్రజా నాట్యమండలి ఈ నిర్ణయాన్ని ఎంతవరకు అమలులోకి తీసుక రాగలిగింది ?

బెంగాలులో క్షామం వచ్చిన మొదటి రోజులలో దేశమంతా ప్రజా నాట్యమండలి కృషిని గుర్తించింది. ఈ ఉద్యమంలో కృషి చేస్తున్న కళా కారులు, క్షామంవల్ల రాబొయ్యే భయంకర పరిస్థితులను అందరికంటే ముందుగా గుర్తించారు. ఈ కాటకంనుంచి తప్పించి, ప్రజల్ని కాపాడ టానికి వారి శక్తినీ, కౌశల్యాన్నీ కేంద్రీకరించి కృషిచేశారు. 'వంగవాణి' అనే దళాన్ని ఏర్పాటుచేసి, దేశమంతటా సంచారం చేశారు.

క్షామ నివారణకు రెండున్నర లక్షల రూపాయలు వసూలు చేశారు. ఇది వరకు ఈరంగంలోకి రాని ఉత్తమ కళావేత్తలను ఆకర్షించగలిగారు. క్షుధా జ్వాలలకు ఆహుతి అవుతూన్న ప్రజలవైపు వారిదృష్టి మరల్చారు. ప్రసిద్ధకవి హరీంద్రనాధ ఛటోపాధ్యాయులు ఈ దళంతోపాటు పర్యటించారు. పృధ్వీరాజూ, ఛటోపాధ్యాయులూ ఇద్దరూ బొంబాయిలో ఈ ప్రజానాట్యమండలి వారి ప్రదర్శనాలలో పాల్గొన్నారు. ఉదయ శంకర్ నాట్యబృందంలోవి ఇద్దరు ప్రముఖ కళాకారులు వీరితో సహకరించారు శాంతారామ్, డేవిడ్ మొదలైన దర్శకులూ, దేశభక్తులూ, యువకులూ ఎందరో చేయూతనిచ్చి ప్రోత్సహించారు. పెంపొందిన ఈ ఉద్యమానికి ఆదేనాంది - పునాది.

### మహాయాగం

ఈ మహోద్యమ చరిత్రలో — ఇంకొక అధ్యాయం, ప్రజానాట్య మండలి ఢిల్లీ శాఖవారి కార్యక్రమం.

ఫిబ్రవరి 1944 లో ఢిల్లీలో మహాయజ్ఞం జరిగింది. ఈ యజ్ఞం జరిగిన పదిరోజులూ వేలాది వేల టన్నుల

బియ్యం, గోధుమలూ, నెయ్యి, పంచదార హోమగుండంలో ప్రేల్చారు. వంగరాష్ట్రంలో, కేరళ, దత్తమండలాలలో ఆ రోజులలో ప్రజలే ఆకటి చిచ్చులకు ఆహుతి అవుతున్నారు

యజ్ఞశాల దగ్గిర ఢిల్లీ దళంవారు 'ప్రజల ఆహారాన్ని కాపాడండి' అనే ఘట్టాలు ప్రదర్శించారు వాటి ప్రతిఫలంగా హోమగుండానికి బలి కాకుండా ఎంతో ఆహారాన్ని కాపాడగలిగారు. యజ్ఞ నిర్వాహకులు రు 25,000 లు క్షామబాధితుల సహాయార్థం బెంగాలుకు పంపడానికి అంగీకరించారు.

ఈ ఉద్యమంలో మరొక కళాశిఖరం— కలకత్తా శాఖవారు ప్రదర్శించిన 'క్రొత్త పంట' అనే నాటకం. ఆ నాటకకర్త విజయభట్టాచార్యులు. ఈ కథలో అప్పటి వంగరాష్ట్ర కర్షక జీవితం చిత్రించబడ్డది. కోతలరోజులలో కరువువచ్చి, ఊరు విడిచి బస్తీలకు వలసపోయిన రైతు, తిరిగి తిరిగి మళ్ళీ ఇల్లు చేరుకుంటాడు. రాగానే ఈన మోసినపొలాలను అ క్రొత్త పంటలను కళ్ళారా చూచుకొని బ్రతుకు మీద ఆశలు కల్పించుకుంటాడు.

ఈ నాటక ప్రదర్శన బెంగాలును ఉర్రూత లూగించింది. మబ్బులు కమ్మినట్టున్న నాటకరంగంలో వెలుగులు విరజిమ్మింది. ఎంతోమంది ప్రసిద్ధనటులకు మేలుకొలుపు పాడినట్టయింది కళా విమర్శకులు అందరూ ఏకగ్రీవంగా ఇది బెంగాలు నాటకరంగంలో ఒక 'మైలురాయి' అన్నారు.

అదే సమయంలో హిందూస్థానీలో అబ్బాస్ రాసిన 'జుబేదియా' అనే నాటకాన్ని బొంబాయిలో ప్రదర్శించారు. సి. పి మెహతారాసిన 'అగరీ' ;'అనద్దే' నాటకాలు గుజరాత్‌లో ఆడారు. బొంబాయి నాటకరంగంలో, గుజరాత్ నాటకరంగములో వీటికి అగ్రస్థానం లభించింది

ఇటీవల అహమ్మదాబాదులో ప్రజానాట్యమండలి శాఖ - 'హంసి' 'బొమ్మరిల్లు' అనే రెండునాటికలను ప్రదర్శించింది. అర్నెల్లలో ఈ శాఖ ప్రసిద్ధికెక్కింది. ఎంతోమంది కళాకారుల తోడ్పాటు పొందగలిగింది. వారిలో ముఖ్యంగా చెప్పవలసినవారు రవిశంకరరావల్, రసికలాల్ పరీక్.

ఇతర రాష్ట్రాలలో పూర్వకళా సంప్రదాయాలను, కళారూపాలను పునరుద్ధరించి వాటిని పెంపొందిస్తున్నారు.

ఆంధ్ర రాష్ట్రంలో బుర్రకథ, హరికథ, లంబాడీ నృత్యం, కోలాటం, వీధి నాటకం, పదాలూ, కోయపాటలూ మొదలైన వెన్నో ప్రాచీన కళా రూపాలను ప్రదర్శిస్తున్నారు. బుర్రకథ విరివిగా వ్యాప్తిలోకి వచ్చింది. పాటా, వచనంతో కథ సాగిపోతుంది. ఈ శాఖకు అనుబంధించిన ఇరవై అయిదు బుర్రకథ దళాలు ఉన్నై. వీరిలో రైతు కుటుంబాలలోనుంచీ, మధ్యతరగతిలోనుంచీ వచ్చిన యువకులున్నారు

## 25 లక్షల ప్రేక్షకులు

నిరుడు ఇరవై ఐయిదు లక్షల మంది ప్రజలు ఈ ప్రదర్శనాలకు వచ్చా

రంచే. ఈ శాఖకు తెనుగునాట ఎంత ప్రాబల్యం ఉన్నదో జానపద కళా రూపాలు ఎంత విశిష్టమైనవో అర్థమవు తుంది. వీరోచిత గాధలతో ప్రజలకు ఉత్తేజనం కలిగించటానికి అవి ఎంతో ఉపకరిస్తాయన్న విషయం ధృవపడింది

అస్సాంలో కూడా ప్రజానాట్యమండలి శాఖ ఏర్పడింది మణిపురినాగనర్తకులు ఎందరో ఉన్నారు. ఆ ప్రదర్శనాలకు ఇక్కడ ఏంతో ప్రశస్తి ఉన్నది. సంయుక్త రాష్ట్రాలలో తొమ్మిది శాఖలు ఉన్నాయి. ఈశాఖలు పూర్వకళా రూపాలను విరివిగా ప్రచారంలోకి తీసుక రాగలిగాయి మహారాష్ట్ర 'తమషా' బొంబాయి 'పవ్డా' దళాలవంటివి మరెక్కడాలేవు. పవ్డా ఒకరకమైన పాట. 'తమాషా' వీధి నాటకం లాంటిది. రెండేళ్ళలో ఈదళాలు ఈరూపాలను ఉన్నత స్థాయికి తెచ్చాయి. వారుమహా రాష్ట్రమంతటా సంచారం చేస్తున్నారు. అన్ని వర్గాల ప్రజలూ వాటీనిచూచి ఆనందిస్తున్నారు. వీటి ఇతివృత్తాలు నేటి జీవితంలోనుంచి ఏరుకున్న వే.

ప్రజా నాట్యమండలి కేంద్రదళం దేశంలో ఎంతో నిపుణతతో పని చేసింది జానపద గేయఫణితులూ, నృత్యాలూ, సంగీతం ఎంతో విరి విగా ప్రచారంలోకి తెచ్చారు. వాటి వల్ల ఎంత ప్రయోజనాన్ని పొంద గలరో అంతవరకు సాధనచేశారు. 'రామలీల' 'అమర భారతం' 'నావికుల సమ్మె' 'కాశ్మీరు జోహారులు' మొదలైన వీరిప్రదర్శనాలు భారత దేశ కళాచరిత్రలో మరపురానిఘట్టాలు.

## చలనచిత్ర నిర్మాణం - విశిష్టత

దేశంలోని కొన్ని విషమ్య పరిస్థితుల మూలంగా కేంద్ర దళంలోని కొందరు సభ్యులను వారి రాష్ట్రాలకు పంపివేయ వలసివచ్చింది. త్వరలో యీ దళ పున ర్నిర్మాణం జరగవచ్చు.

ఈ ప్రజా నాట్యమండలి చరిత్రలో మరొక ప్రధాన ఘట్టం— 'ధర్తీ - కె - లాల్' అనే చిత్రాన్ని తియ్యడం, కరువుల్లో నలిగిపోతున్న వంగ రాష్ట్ర కర్షక జీవితం ఇతి వృత్తంగా తీసుకోవడంలోనే ఫిల్ము చరిత్రలో ఒక ప్రత్యేకతను గడించు కొన్నది. సామాన్యంగా ఇప్పుడు తీస్తున్న చిత్రాలకు లేని విశిష్టత దానికి వున్నది కరువులతో, వరద లతో నష్టపడుతూనే కర్షకుడు ఎలా ముందుకు వస్తున్నాడో సహజంగా, ప్రతిభావంతంగా చూపారు

ఈ ఫిల్ములో పాల్గొన్న వారెవరూ స్వలాభాపేక్షతో రాలేదు. ప్రజా నాట్య మండలి శ్రేయస్సు, కళాభ్యున్నతీ అవే వీరికిలక్ష్యాలు, క్రొత్త నటులకళాభిరతీ, కృషీ దేవిడ్, కె. యన్ సింగ్; స్నేహప్రభ మొదలైన కళావేత్తలను ఆకర్షించి,వారికళానుభవాన్ని చేకూర్చుకో గలిగింది.

ఈనాడు ప్రజా నాట్యమండలి కళా ప్రపంచంలో ఒక మహోద్యమ మైంది. కర్షకులనూ, కార్మికులనూ ప్రబోధించి, ప్రజలు మత కలహాగ్నులకు బలికా కుండాదేశాన్ని కాపాడాలనే అమరసందే శాన్నిమూలమూలకూ వివిధకళారూపాల ద్వారా తీసుక పోతున్నారు. సంస్థాన

ప్రజా పోరాటాలను, తమన్యాయమైన హక్కులకోసం పోరాడుతున్న కార్మిక కర్షకులను, ఉపాధ్యాయులను ప్రతిబింబిస్తూ ప్రజా శ్రేయస్సును ఆకాంక్షిస్తూ ఎన్నో ప్రదర్శనాలు ఇస్తున్నారు వర్ధమాన కళా సంస్కృతుల ప్రదీప్తం చేస్తున్న కళా జ్యోతులు ఇవి

ఈనూతన కళా దర్పణంలో ప్రతిబింబించేది — ప్రజాతంత్ర స్వంతంత్ర భారతదేశం!

## 800 కొత్తకొత్త పాటలూ
## 52 కళా నిర్మాణాలూ

అఖిల భారత ప్రజా నాట్యమండలి చతుర్ధ సమావేశం, ఏప్రిల్ చివరివారంలో కలకత్తాలో జరిగింది. కలకత్తాలో ఈసభలు జరపాలని నిశ్చయించుకోవడంలో ఎంతో అర్ధం, ప్రాముఖ్యం ఉన్నది. అది మత కలహాలకు విధ్వంసక చర్యలకు గురియైన ప్రధాన నగరాలలో ఒకటి, విశ్వకవి రవీంద్రుని జన్మస్థానం. అక్కడే—ఈ మహాసభలు జరపడం ఉచితమనీ, విధ్యుక్త ధర్మమనీ ఉద్దేశించారు. టాగూర్ ప్రబోధాలను ప్రజలకు జ్ఞప్తికితెచ్చి, ద్వేషాలనూ భేదభావాలనూ విస్మరించేట్టు చేసి, రవికవి పాదులుకట్టి పెంచిన ఉత్తమ సంస్కృతిని ముందుకు తీసుకపోవడం కళాకారుల వర్తవ్యం.

ఈ మహాసభ కళా కారులకూ, రచయితలకూ సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాన్ని బలపరచ డానికీ, స్వతంత్ర ప్రజా ప్రభుత్వాన్ని నిర్మించుకోడానికీ ముందుకు రమ్మని 'పిలుపు' ఇచ్చింది.

శ్రీ నిర్మల చాందా, బెంగాల్-శ్రీ సురేష్ గోస్వామి, అస్సాం - ప్రసిద్ధ వంగనీయుడు శ్రీ మనోరంజన భట్టాచార్యులు అ ధ్య క్ష త వహించారు. పండిట్ నెహ్రూ, శ్రీమతి విజయలక్ష్మి శ్రీ రసిక్‌లాల్‌పరీక్, శ్రీ. జె. సి సేన్ గుప్తా ప్రసిద్ధ దర్శకులు ఫణి ముజుందార్, డాక్టర్ ముల్కరాజ్ ఆనంద్ మొదలైన ప్రముఖులు సభలువిజయవంతంగాజరగాలని ఆకాంక్షిస్తూ సందేశాలు పంపారు ఈఉద్యమాన్ని సమీక్షిస్తే - దేశంమొత్తంమీద 52 నూతనకళానిర్మాణాలూ, 800 కు పైగా కొత్త కొత్త పాటలు తీసుకురాగలిగిందన్న విషయం అవగతమైంది. 50పాటలకు పైగా ప్రభుత్వం నిషేధించింది. ఢిల్లీలోను, బెజవాడలోను ప్రజా నాట్యమండలివారి కార్యాలయాలపై పోలీసులుపడి సోదాలుచేశారు.

అన్నింటిలోకి రాణించింది, కలకత్తా దళంవారు ప్రదర్శించిన open air show (వీధినాటకం లాంటిది). ఈ ఉద్యమం అంటే సానుభూతితో వచ్చి, సహకరించి, మహాసభలో పాల్గొన్నవారు పంకజ మల్లిక్, సమరేష్ రాయ్, సుప్రిత ఘోష్, ద్విజేన్‌చౌదరి—సినిమా, రేడియో రంగాలలోని ప్రముఖులు. "అమరవీరుల పిలుపు"అనే ఛాయా నాటిక - మన జాతీయోద్యమంలోని వీరోచితమైన అమర ఘట్టాలతోనిండి, గుండెలు కరిగించే హింసాకాండను "చూడగలరా?" అన్నట్టు ప్రదర్శించి — "ఐక్యత - ఐక్యత - ఏకంకండి!!"అని ఇచ్చిన పిలుపు ఇంకా ఇంకా మార్మోగుతూనే ఉంది.

# బానిస స్వప్నం

శ్రీ శ్రీరామకవచం వెంకటేశ్వరశాస్త్రి

కౌతుక పూసిన
కటిక చీకటిలో
కాలే కదలని
వల్లకాటిలో
ఎక్కడికో
ఎందులకో
నాకే తెలియని
నాకే దొరకని
లోకాలను
చోద్యాలను
చూదామని వూహించాను
పోదామని పయనించాను

* *

విశృబ్ధపు లోకం
నింగిమీది చుక్క
నా యాత్రకు సాయం
చేయాలను సంకల్పం
కలదను ధైర్యంతో
నా మేధోపథంలో
వంద వేల యోజనాలు
అందకుండ యెగిరిపోయాను

* *

నా ప్రాయాణిక కష్టం
నా నాడుల రక్తం
నా శక్తుల జీవం
అలసిందని
సొలసిందని
నా జీవిత దుఃఖాలను
యిలలో తొలగించగ
ప్రకృతిదేవి, తానొకో
జోలపాట పాడింది
మేలుబాట చూపింది

* *

నా,

అడియాసల స్వప్నంలో
అయాసపు నిశ్వాసంలో
అందలమెక్కిన రాజులు
చిందరవందర ప్రజలు
మలయానిల సౌహార్ద్రం
తరులుగిరులు ఎన్నెన్నో
ఏమేమొ కనిపించాయ్
నా మెదడును కదలించాయ్

అందు

సుషుప్త ప్రపంచం
ఘోషపెట్టు నదీగర్భం
చుక్కలెగురు గిరియగ్రం
పొంగులెగయు జలధిహోరు
నాశక్తిని కుంగించాయ్
నారక్తం పొంగించాయ్
ఆస్వర్గపు లోకంలో
ఆస్వర్ణ మహీస్థలిలో
నాకష్టాలే పోతాయని
నాశాస్త్రాలే నిత్యాలని
ఈకష్టైనె మరచేశాను
ఈసృష్టెంతని నిందించాను

ఇంతలో
నామైకపు స్వప్నంలో
బాంబు, బాకు, మెషిన్ గన్లు
ఒక్కసారి ఎగిరి వచ్చాయ్
వెక్కివెక్కి నన్ను చూచాయ్

*　　　*

నడిరాతిరి దృశ్యం
పైశాచిక నృత్యం
సుఖమెరుగని నిత్యం
ప్రాపంచిక సత్యం
నా బ్రతుకున కంత్యం
యిదియేనంటే!,
అర్ధరాత్రి నిశ్శబ్దా
కాశపు టాకారంలో
క్రొవ్వి నవ్వ నక్షత్రాలు
మానవ హృద్విదారక
గోమాయువు నిస్వానం
భగ భగ భగమంటూ
పైకెగిరే కాటిపొగ
కణ కణ కణమను
చితిపై చింత నిప్పులు
నిలదీ శడిగాయ్
ఏ దేశపు బానిసవని?

*　　　*

త్రైవిష్టప సీమల్లో
నందనవన భూముల్లో
చరించిన నేనేనా
యీ ఎముకల, బొమికల
కుళ్ళిన లోకంలో
నిలబడియున్నది?
నాదేశం కానేకాదిది
అదిసర్వ సమృద్ధం:
అని రక్తం పొంగి పొంగి
జననాడులు కదలి కదలి
నిద్రాణశక్తి కనలి కనలి
శ్మశానపు భూముల్లో
అశ్రుసిక్త భస్మపుంజంలో
కనులువిప్పి ఎదురుచూచాను
కెవ్వుమనుచు కేకవేశాను

*　　　*

నా దేహబద్ధ లోహాయస
శృంఖలాల తెగత్రెంచగ
పోరాడిన యత్నంతో
కదలించిన రక్తకణం
యీ జీవితమానపణం
కలికాల సర్పఫణం
ఓంకారపు ప్రణవంబై
స్వతంత్ర శంఖధ్వానంబై
పతితజన దాస్యాభావ
నవజగత్తుకు
నాందీగీతం, నాందీగీత
నవారంభ సంరంభం
శుభోదయ, నవోదయ
అరుణోదయమ్మిదె
రండి రండి పతితులారా!
రాండి రాండి వీరులార!
కదలండి కదులుమనుచు
వేయివేల నాలుకల
దివాంతమ్ము విరిగిపడగ
దళదళల్ అదరిపడగ
ఎలుగెత్తే పిలిచింది
కలసత్యం నిజమన్నది

*　　　*



# క్రౌక్

## శ్రీ తెన్నేటి సూరి

"క్రౌక్ –"

"యాటం బాంబు విసిరారూ ? ..." కోపంగా చిరునవ్వు నవ్వాడు వెంకటి.

నిజంలే; ఈ సంయుక్తాక్షరాన్ని యెవడు నిర్మించాడోగాని - ఈ బాంబు విసిరితే ఏ మౌంటు ఎవరెస్టయినా ఇట్టే ధ్వంస మయిపోతుంది. పైగా దీని రహస్యం ప్రతివాడికీ తెలుసు; అదీ ప్రమాదం. కాల మాన పరిస్థితులతో నిమిత్తంలేకుండా ఏ లక్ష్యంమీదనైనా, ఏ క్షణానైనా, ఎంత దూరంనుంచిబడితే అంతదూరంనుంచి, ఏ నస్మరంతైనా విసిరెయ్యొచ్చు

"అగుణను ఆ మాటంటే మీకింత పౌడుచుకొస్తుందనుకోలేదు" అన్నాడు సాహిత్య పీరాధిపతి.

"మీరేదో కావ్యం వ్రాశానూ, వినిపిస్తామూ అంటే వచ్చాంగాని - వ్యక్తుల పరోక్షంలో వాళ్ళనిగురించి మీరు దుష్ప్రచారం చేస్తూంటే, అది వింటానికి రాలేదు" అన్నాడు వెంకటి.

"దుష్ప్రచారమేమిటి ? — ఏ వ్యక్తి గురించైనా నా యిష్టమొచ్చిన అభిప్రాయాన్ని కలిగివుంటానికి నాకు సర్వస్వాతంత్ర్యం వుంది."

"వుంది; కాని ఆ అభిప్రాయాన్ని ఇతరులకు అందజేసేటప్పుడు మట్టుకు తగిన నిదర్శనాలూ నిరూపించుకో వలసిన బాధ్యతా వుంటుంది."

"ఆమాత్రం బాధ్యతలు తెలియని వాణ్ణి గాను లెండి; నిదర్శనాలూ వున్నాయ్."—

"వుంటే చూపండి."

పీరాధిపతి, జేబులోనుంచి ఒకచిన్న పుస్తకం బయటికి తీశాడు—

"ఈ మహాగ్రంథం తిలకించండి : గ్రంథ నామధేయం- 'గడ్డిపన,' గడ్డిపన, నాగలికొయ్య,బిచ్చగాడు,కుంటిముండా— బలే కావ్యవస్తువులు.. హెం హెం హెం" అంటూ గుర్రపు సకిలింపులా పెద్దపెట్టున ఒక వెకలినవ్వు నవ్వాడు.

సదస్యులలో కొందరు ఆనవ్వును అందిపుచ్చుకుని యకయక లాడారు.

ఈ ప్రవర్తనను యువకులంతా కంటగించు కున్నారు ముఖాన గంటు బెట్టుకుని కోపంగా కూర్చున్నారు.

"షాహుకారు తన పెళ్లాన్ని జమిందారుకు తార్చటమొక్కటే కావ్యవస్తువుగా పనికి వస్తుందని పీఠంవారి అభిప్రాయమా?" అన్నాడు ఇంకో యువకుడు, కొంచెం పెంకెతనంగా.

మనవాడు దెబ్బకి దెబ్బ తీర్చాడని యువకులంతా కచ్చకొద్దీ నవ్వారు.

"పెద్దాచిన్నా లేకుండా—శాస్త్రిగారివంటి మహాపురుషుల్ని, కుర్రవాళ్ళు, మీరిలా

విమర్శించటం అదేమీ బాగుళ్ళేదు." అన్నాడు, 'ఆంధ్రకథా గండపెండేరం' కథానిక రచనలో ఇల్లాంటి మహా రచయిత స్వర్గ మర్త్య పాతాళాల్లో ఇంత వరకు ఎక్కడా పుట్టలేదని శాస్త్రిగారు దేశమంతా డబ్బావాయిస్తూ వుంటారు. ఈయన యింట్లోనే యీ సమావేశం జరుగుతోంది.

"మంచీ చెడ్డాలేకుండా పరోక్షంలో పెద్దమనుష్యుల్ని స్కాండలైజు చెయ్యటము శాస్త్రిగారికీ బాగుళ్ళేదు. శాస్త్రి గారిని మీయింటికి పిలిపించి ఇల్లాంటి 'స్కాండల్సు' ప్రచారం చేయించటం, మీకూబాగుళ్ళేదు" అన్నాడు వెంకటి.

ఆసభలో వున్న వ్యక్తుల్లో రెండు చీలికలు బయలుదేరాయి. తర్జన భర్జన సాగింది. అంతారసాభాస మయ్యేలా తయారైంది. పీఠాధిపతి గుక్కదిప్పుకొని,

" ఆగండాగండి ; తొందరపడకండి! మాట వరసకన్న దానికి ఇంత గందరగోళమేమిటి ? .... ఆగం డాగండి .. తొందరపడకండి" అంటూ సర్దాడు

కొంచెంచల్లబడుతోంది సర్దిన ట్టేసర్ది మళ్ళా మొదలెట్టాడు

"యువకులు మీరంతా యిందులో యింత కంటగించుకోవలసిందేమీ లేదు. అరుణ అల్లాంటి లేకిమనిషి; దానికి మనమేం జేస్తాం ? - అతను జేస్తున్న పనులు ఆంధ్ర కవిలోకానికే తలవంపుగా వున్నయ్ "

"ఏమిటతను చేసినతలవంపుపని ?-" వెంకటి నిగ్గదీశాడు.

"ఏమిటా ?.... ఈ వెధవ ఎవిమిది పేజీలు చెత్తా, అర్ధణాకి, బికారిలా, ఈ వూరి యూనివర్సిటీ మార్కెట్టులో, కవినని పేరుతో, తను స్వయంగా అమ్ముతున్నాడు. కవిజాతి తలెత్తుకు తిరగటానికి చేసే పనులేనాయివి ?-"

"కాదు కాదు!. .కవిజాతి బానిస రచనలు చెయ్యవలసిన అవసరం లేకుండా స్వతంత్రంగా బ్రతకటానికి మార్గం చూపించాడు ; కళ్ళుతెరవండి !" అని కేకబెట్టాడు రామూ.

"కళ్ళు తెరవండి !" అని అరిచారు యువకులంతా.

"సభ ముగింపుచేస్తే బాగుంటుంది; కావ్యపఠన జరిగినా శ్రోతలు వినే మన స్థితిలో లేరు." అన్నాడు కథికుడు.

"బెలబెలా అంతా బయటికి వచే శారు ముఖం కందగడ్డ చేసుకుని పెద్ద పెద్ద అంగలుగా రోడ్డువెంట నడిచి పోతున్నాడు వెంకటి. వెంకటి బావ మరిది సుందరం అతనివెంట అంత తొందరగా నడవలేక పరుగు తియ్యవలసి వస్తోంది.

వెంకటివెంట సుందరం కావ్యపఠన జరుగుతుందేమో విందామని వచ్చాడు. అతను కాశీలో ప్లీడరీ చదువుతున్నాడు. సెలవలకు అక్కగారిని చూచి పోదామని వచ్చాడు అతగాడు ఈ గందర గోళమంతా చూచి విస్తుపోయాడు. నెమ్మదిగా వెంకటిని పలక రించాడు.

"ఏమిటి బావా ఇదంతా"

"మన సాహిత్య ప్రపంచమోయ్"

"మన సాహిత్య ప్రపంచం!"

"హాఁ .. ఇదే మన సాహిత్య ప్రపంచం కాశీలో గంగవొడ్డున యేదు

స్తున్న వెధవకి నీకిదంతా ఎలా తెలిసేదు స్తుందిలే. మరి?"

"అరుణ సంగతేమిటి బావా?"

"ఇప్పుడు నేను మాట్లాడే స్థితిలో లేను. భోజనాలయాక చెబుతాను"

* * *

భోజనంచేసి బావమరదు లిద్దరూ వెన్నెల్లో కూర్చున్నారు సుందరం అరుణసంగతి చెప్పమని బావగార్ని అడి గాడు వెంకటే ఇలా ప్రారంభించాడు.

అరుణసంగతి అర్థంచేసుకోవాలంటే మన అధునాతన వాఙ్మయ చరిత్రకూడా కొంత తెలుసుకోవాలి.

20 వ శతాబ్దారంభంనుంచి ఒక విప్లవ యుగం ప్రారంభమయింది. యూరపు దేశపు రచయితలంతా విప్లవ కారులుగాతయారయ్యారు సఖముఖాలా విప్లవాలు రేకెత్తించే రచనలు సాగిం చారు. ప్రతిఫలంగా ఆ యా నిరంకుశ ప్రభుత్వాల చేతుల్లో చాలా చిక్కులు బడ్డారు జైళ్ళలో మ్రగ్గిపోయారు; మాతృభూములనుంచి బహిష్కరించ బడి ద్వీపాంతరవాసశిక్ష ననుభవిస్తూ, భార్యా బిడ్డలకు దూరమై ఎన్నెన్నో అవస్థ లనుభవించారు ఉరికంబాలు యెక్కారు.

1914 లో మొదటి ప్రపంచయుద్ధం వచ్చింది దాంతో అన్ని దేశాల్లోనూ ప్రజాస్వామిక ప్రభుత్వాలేర్పడి ప్రజల కష్టాలు తీరుతాయని ఆశించారు సైన్యా లను సమీకరించుకోటానికి సామ్రాజ్య వాదులు అల్లాంటి ఆశలుకూడా చూపుతూ వచ్చారు. కాని యుద్ధం ముగిసిన తదాది ఎక్కడికక్కడ మరింత ఉచ్చులు బిగుసుకున్నయ్ ఫాసిజం తలెత్తి పిశా చంలా గంగశివాలాడి ప్రజల్ని ఉక్కు పాదాలక్రింద నలిపివేయడం ప్రారంభిం చింది. రచయితలు ఇంకేమీ చేయలేక పోయారు. ప్రజల తరపున నోరెత్తిన రచయితనల్లా 'గెలటైన్సులో' తలలు తుంచేశారు. చర్మాలు వొలిచి రోడ్ల మీద ఎండేశారు. దీంతో రచయితల్లో గొప్ప నిస్పృహ, నిరాశా, ఆరంభ మయ్యాయి. బ్రతుకదలిస్తే నోరు మూసుకు కూర్చోవలసిన దుస్థితంతా ఏర్పడ్డది. కాని కవైనవాడు తినకున్న ఆవేశాన్ని ఏదోరూపంలో వెళ్ళగ్రక్క కుండా ఆగలేడు. ఆ రకంలో కొన్ని రచనలు బయలుదేరాయి అందులో మొదటిది 'సబ్జక్టివ్ పొయిట్రీ' కవి ఏడుస్తాడు; ఎందుకేడుస్తున్నాడో మాత్రం చెప్పడు. కోప్పడతాడు; ఎవరిమీదో, ఎందుకో చెప్పడు. చెబితే ప్రభుత్వాలు ఊరుకోవుగా మరి.

మరో కొందరు రచయితలుబయలు దేరారు. కవి తనకు కావలసిన ప్రతి అవసరాన్నీ ఒక స్త్రీగా చిత్రించడం, అది తనకు అందకుండా అనంతాకాశంలో ఎగిరి పోతోందని ఒక విరహగీతిక వ్రాసిపారెయ్యడం

ఇక మూడోరకం: ప్రజలను గురించీ, ప్రభుత్వాలను గురించీ, రాజ్యాంగాలను గురించీ యేది మాట్లాడినా చిక్కు వస్తుంది సెక్సును గురించీ దేవుణ్ణి గురించీ మన యిష్టంవచ్చినట్టు వాకొన వచ్చు మన జోలికెవ్వరూరారు అందు చేత 'స్త్రీ పురుషవాంఛ'ను తీర్చుకోవడ ములో ఎన్ని వెకిలి పద్ధతులో రీసెర్చిచేసి

బయటికి తెచ్చారు. ఈపద్ధతుల్ని ఆచరణలో పెట్టుకొని రచయితల్లో నూటికి తొంభైమంది నపుంసకు లయ్యారు. ఆడదంటే వాళ్ళకి భయం. ఆడదాని ముందు పెద్ద 'ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్స్' దీన్ని సూచించే రచనలు కొన్ని బయలుదేరాయి మచ్చుకి:-

నాయకుడు నాయికతో:—

1. బలిసి జార్చున్న ప్రేమదేవతవునీవు
   జారుచెక్కిళ్ళ ప్రేమపూజారినేను
2. అందుకోలేని గగన పర్యంకసీమ
   అణి ముత్తెపు చుక్కల రాణివీవు
   తరుణీ! పాతాళలోకంపు టిరుకు సందు
   లోన, కుళ్ళినమురికి కాలువను నేను.

సుందరం హడలి పోయాడు—

"అరే! యేమిటిది బావా! .."

"వ్రాశార్రా బాబూ వ్రాశారు—ఇదంతా కవిత్వంక్రింద చలామణీ జేశారు"

"ఆరి వీళ్ళ టస్సల్ జెక్కా!"

"ఇంకావుంది వినవోయ్— ఇది ఇంకోరకం కవిత్వం ...దీన్ని "సర్రియలిజం" అంటం కద్దు. మచ్చుకు;

"అమ్మ యేడ్చింది హోరున—
ఘోరున వర్షం,
వర్షం. వర్షం
మబ్బులు. మబ్బులు
తెల్లమబ్బులు,
తెనాలి వెళ్ళాను
కుక్కవెంట
పాండవులు స్వర్గానికి—
.... .... .... .. ..."

"అరె! ఏమిటిదంతా!" అన్నాడు సుందరం.

"ఇదింతేరా. "సర్రియలిజం"— మనస్సుమీద బుద్ధి కంట్రోలు సాంతం లాకులెత్తేశాం".

"చచ్చాం!"

వెంకటీ మళ్ళా మొదలు బెట్టాడు,

"ఇది యూరపియన్ రచయితల గ్రంథం" ఈదౌర్భాగ్యమంతా మనదేశానికి దిగుమతీ అయింది. మనసారస్వతం గూడా ఇదే రూపాన్ని పొందింది.

ఈ రచనలన్నిటినీ పరిశీలించి చూస్తే అట్టడుగున వున్న మానసిక దుస్థితి ఒక్కటే-నైరాశ్యం(డిఫీటిజం)

అరుణ సారస్వత ప్రపంచంలోకి అడుగు బెట్టేప్పటికి మన ఆంధ్ర సారస్వతం ఈ సుడి గుణ్ణంలో తిరుగుతోంది.

అరుణది బందరు, బెజవాడ రైల్వే లైనులో ఒక పల్లెటూరు. అతను ఇక్కడికి వచ్చి కాలేజీలో బియ్యే చదివాడు. అప్పట్లో గుడివాడ హైస్కూల్ నుంచి ఈ కాలేజీకి వచ్చిన విద్యార్థులలోనుంచి, చాలామంది యువ రచయితలు మెరికల్లాంటి వాళ్ళు బయల్దేరారు దాని వెనక చాలా చరిత్ర వుంది. ఇప్పుడది మనకప్రస్తుతం.

అరుణ విద్యార్థి దశలోనే కొన్ని రచనలు చేశాడు. వాటిలో ఒక ప్రత్యేకత కనుపించింది. కాలేజీలో వుండే యువ రచయితలంతా అరుణతో సాహచర్యం కలిగివుండే వాళ్ళు. అరుణ బి. య్యే. ప్యాసయాక యీ వూళ్ళోనే వుండిపోయాడు. అతనొక పాకలో వుండేవాడు. ఆ పాకప్రక్కన వున్న దొడ్లో యెర్రగా విరియ బూసి ఒక కొండ తంగేటి చెట్టు వుండేది. ఆ చెట్టుక్రింద ఊళ్ళోవున్న

యువక రచయితలు కొందరు అరుణను కలుసుకుంటూ వుండే వాళ్ళు. ఒకరి రచనలు ఒకరికిచదివి వినిపించుకుంటూ వుండేవాళ్ళు.

1937 జూన్ 1 వ తేదీన ఇలానే యువకులంతా ఆ చెట్టుక్రింద సమావేశ మయ్యారు. తలోరచనా చదివి వినిపించారు. ఇది బాగుందనీ, అది బాగుశ్ళేదనీ తలో విధంగా మాట్లాడుకుంటు న్నారు అరుణ మౌనంగాకూర్చున్నాడు.

"అరుణ మాట్లాడేం?" అన్నాడు రాముా

"ఆలోచిస్తున్నాను" అన్నాడు అరుణ.

ఏమిటీ ?"

"ఈరచనలన్నీ వ్యర్థమేమోనని తోస్తోంది"

"అదేమిటి ?"

"అసలు రచనలు ఎవరికి ? ఎందుకు ?-"

"అదేం ప్రశ్న ?....ప్రజలకీ ప్రజల్ని సంస్కరించటానికీ-"

"మీ సమాధానం నాకు నచ్చింది.... కాని మనవాఙ్మయంలో ప్రజలేరీ ?"

"అవునుఏరీ!...."అంటూవిస్తుపోయి ఒకళ్ళ ముఖంలోకి ఒకళ్ళు చూసుకొన్నారు, తమతమ కాయితాలు తిరగా బోర్లా వేసి చూచుకొంటున్నారు. ఏముంది వాటిల్లో ?

అరుణ అన్నాడు—

"మన వాఙ్మయం రాజులకుబానిసగా అమ్ముడుబోయి, ప్రజాసేవను విస్మరించింది. యువకులు మీరంతా యీవిషయాన్ని గమనించి తగిన సంస్కృతిని నిర్మించండి. మనజీవితాలూ, విజ్ఞానం చరితార్థ మవుతాయి."

"యువకుల హృదయాలకు నిద్దుర లేచినట్లయింది.

"అవును మనమంతా ప్రజలసమస్యలను తీసుకుని రచనలు దూకించా" లన్నాడు రాముా.

"మనమంతా ఒక సంస్థగా యేర్పడి పనిచేస్తే ఇంకా బాగుంటుంది"న్నాడు. ఇంకోయువకుడు.

'మహోదయ పరిషత్' అనేపేరుతో ఒక రచయితల సంస్థయేర్పడ్డది. ఆ సంస్థకు అరుణ కార్యదర్శి ప్రజాసాహిత్య ప్రచారానికి యీయువకులంతా అహోరాత్రులూ పనిచెయ్యటం ప్రారంభించారు.

కాని మనసంఘం బొత్తుగా ఎండ్రుబట్టి మోడువారి పోయింది. అధవా, ఎక్కడన్నా కొంచెం పచ్చివుండీ ఎర్రటి చిగురు పొటమరించితే ఆమోడు తనం దాన్ని రెండురోజుల్లో బలవంతాన తన లోకి లయించు కుంటుంది.

మహోదయ పరిషత్ పనిచెయ్యటం సాహిత్య పీఠాధిపత్యంలో బైటాయించి కూర్చున్న కవి గజ గండ పెండేరాల కెవ్వరికీ ఇష్టం లేకపోయింది. కుర్రకుంకలనీ, క్రాక్స్ అనీ, సాహిత్య విధ్వంసకులనీ, సంస్కృతిని మాదిగ మంచం చేస్తున్నారనీ—ఇలా దుష్ప్రచారం ప్రారంభించారు. నిరుత్సాహ పడకుండా యువకులు మాత్రం రచనలు సాగించుతూ ముందుకుసాగిపోతూనేవున్నారు.

కాని ఒకపెద్దచిక్కు కనుపించింది. రచనలైతే వీళ్ళు చేస్తారు. కాని వాటిని ప్రజల కందజేయడమెలా ?

అప్పట్లో పత్రికలన్నీ ఈ రచనలను బాయ్‌కాట్ చేసేవి. దీనికి అనేక కారణా లున్నయ్. ఈ రచనలు ప్రచురించుతే పేరులోవున్న కవి గణాలు తమకు రచన లివ్వరేమోనని భయం. ప్రజల హక్కులను వాంఛించే రచనలు ప్రచు రించితే ప్రభుత్వం పత్రికల్ని ఆప మంటుంది. జమీందారులవల్ల వచ్చే వర్షాజినాలు మన్నా అవుతాయ్. మరో వైపున సాహిత్య పీఠాధిపతులు పెద్ద పెట్టున ఈ రచయితలమీద దుమారం లేపుకొస్తున్నారు. అంచేత ఈ రచనలు ప్రజామోదాన్ని పొందలేవేమోనని ఒక భయం, వీటినన్నిటినీ తలదన్ని - ఏదో ఒక రంకుపురాణం అచ్చు వెయ్యక పోతే పత్రిక ఖర్చుగాదని ఒక అభి ప్రాయం చాలమంది పత్రికాధి పతుల్లో బాగా నాటుకుపోయింది. ఈ భావాన్ని నిర్మూలించటం మాత్రం సాధ్యం గానిపని.

పోనీ పత్రికల్లో కాకపోతే మానే! తామే స్వయంగా ప్రకటించుదామంటే యువకులవద్ద ఉత్సాహ ముందిగాని డబ్బేదీ? పైగా వాళ్ళంతా 30 – 35 డిప్రెషన్‌లో పట్టాలుపుచ్చుకున్న 'కళా బ్రహ్మచారులు' నిరుద్యోగంలో హత మయిపోతున్నారు.

ఈ స్థితిలో యీ సంస్థ యే కార్య క్రమాన్నీ ఆచరణలోకి తేలేకపోయింది. అల్లా అల్లా తంటాలుబడి ఒక కథల సంపుటిఅచ్చువేస్తే పుస్తకాల అమ్మకం? యేజంట్లు గ్రంథాలు అమ్మటంమాత్రం అమ్మేశారుగాని పైకంమాత్రం తామే మ్రింగేశారు.

ఈ యువకులకు ఏమి చేయటానికీ తోచలేదు. ఒకనాడు ఆ కొండతంగేటి చెట్టుక్రింద కూర్చొని మిల్లగుంతాలు ఐడుతున్నారు. అరుణకూడా దించుకు పోయి దిగాలుపడి నిస్పృహగా చెట్టు మొదటి కానుకొని కూర్చున్నాడు.

"మ్చ్! లాభంలేదు"

"హుం! యేంజేస్తాం?"

"డబ్బుండాలిరా!"

"ఈ దేశంలో మంచిపని యేది మొదలెట్టినా కొసకంటా సాగదు. ప్రోత్సాహమేరాందే!"

"జాతీ సాంతం చచ్చిపోయింది. దీనికి చైతన్యం చస్తేరాదు. చచ్చిన గొడ్డు బ్రతకడ మెక్కడన్నాఉందిట్రా!"

"లాభంలేదు"

తలో మూలా కాళ్లు పారజాపేశారు.

"నాన్నా!"

పాకలోనుంచి ఒక స్త్రీకంఠం పిలి చింది.

అరుణ పాదాలు నిస్పృహగా పాక లోకి నడిచినాయి.

పదినిమిషాలపాటు అంతా నిశ్శబ్దం.

* * *

అరుణ చివాల్న పాకలోనుంచి ఉత్సా హంగా బయటికి వచ్చాడు. అతని కనీ నీకల్ చీకటి వెలుగులు జిమ్ముతున్నాయ్.

"మనం అనవసరంగా నిరుత్సాహ పడ్డాం. క్రొత్త కార్యక్రమం ఒకటి ఆచ రణలోకి తెచ్చి విజయంతో ముందుకు నడిచి పోతాం"

"ఏమిటది?"

"ఏమిటది?"

"ఏమిటది?"

"ఎవరికివారు 7,8 పేజీలకు మించని ఒక్కొక్క చిన్న రచన చెయ్యండి. దాన్ని ఎవరికి వారు అచ్చు వేయించు కుందాం. అర్థణా ఖరీదు బెట్టి ఎవరికి వారు అమ్ముదాం. ఆడబ్బుతో మళ్ళా మరోరచన అచ్చు వేయించుదాం. ఇలా అనంతంగా పని చెయ్యొచ్చు. ఒకొక్కరు అయిదేసి రూపాయిల పెట్టుబడి సేకరించితేచాలు. అనంతకాల గర్భంలోకి నిర్విఘ్నంగా మన కార్యక్రమాన్ని కొనసాగించుకు పోగలుగుతాం. ఇంతేకాదు ఈ విధానం ద్వారా ప్రజల్లోకి తేలిగ్గా చొచ్చుకు పోగలుగుతాం."

యువకులంతా ఉత్సాహంతో ఎగిరి గంతులేశారు. 'ఇన్‌క్విలాబ్ జిందాబాద్' అని అరుచుకుంటూ అరుణను చుట్టేశారు.

"ఎవర్రాలోపలా ?"

అరుణ, నీరెండలా చిరునవ్వు నవ్వాడు.

"సుబ్బలక్ష్మి !"

"అరె! ఎప్పుడొచ్చింది ?" అంటూ అంతా బెలబెలా పాకలోకి జొరబడ్డారు, ఒకళ్ళ నోళ్ళు తోసుకుంటూ.

* * *

"సుబ్బలక్ష్మి యెవరు బావా ?" అన్నాడు సుందరం.

అరుణను ఆంధ్ర సారస్వతానికి హవిస్సుగా అందించిన మహాతల్లి. ఒక పద్మశాలి స్త్రీ. అరుణకు చిన్నతనంలో పాలిచ్చి పెంచింది.

అతన్ని చూడ్డానికి అప్పుడప్పుడు వాళ్ళవూరునుంచి వస్తూవుంటుంది."



# అంతర్యుద్ధం

## శ్రీ మలిరెడ్డి వెంకటరంగయ్య

ప్రళయ కాల విలయ తాండవం గావిస్తూ
భయంకర విషాద ఘోషలతో.
కక్షబూని పంజాబున పచ్చి నెత్తురును త్రావ
కుక్షినిండ నరమాంసం విచ్చలవిడి భక్షించను
వచ్చావా? ఓ అంతర్యుద్ధమా!
బెంగాల్ రాష్ట్రం క్రుంగి పోవగా
నౌఖలి జిల్లా నాశం చేస్తూ
బీహార్ రాష్ట్రం బీటలు వారగ
పంజాబంతా భస్మంకాగా
వెడలితివా? ఓ అంతర్యుద్ధమా!

చోటు లేదు నీకు నేడు
ఓటమె వెనుదిరిగి చూడు,
సాటిలేని ప్రజా బలం
కోటవలే నిలచిందదె!
బడబాగ్నిని హిమ కణములు ప్రభవించినవి
అంధ తమసమందు ఆశ లగుపించినవి-
చీల్చి చీల్చి పరిపాలించే
పీల్చి పీల్చి ప్రజలను చంపే
ఆట్లీ విసరిన అనైక్యతాస్త్రం
అపరూపంబై అవతరించి యిటు
పిడుగుల గనియై
ఇడుముల వనమై
ప్రజల పాలిటికి బడబానలమై
నడచితివా? ఓ అంతర్యుద్ధమా!

పిల్లల ముందర తల్లుల జంపే
తల్లుల ముందర పిల్లల జంపే
ధనధాన్యంబుల దగ్ధం చేసే
ఇల్లు వాకిలిని కొల్ల గొట్టే
క్రూరత్వానికి కుటిలత్వానికి
మూలకందమై దూకితివా? అంతర్యుద్ధమా!

నీ ప్రభువుల బూటకాలు
నీ మిత్రుల కుతంత్రాలు
మరచిపోము ఎన్నటికీ
మండుచున్న వీగుండెలు!
ప్రజా బలము వారధిగా పొంగు లెత్తెను,
జగతి కనుల నరుణరేఖ మొలకలెత్తెను,
ఓ అంతర్యుద్ధమా!
చోటులేదు నీకు నేడు—

# సాహిత్యపరుడు - కాలినిన్

మూలం: మైకేల్ బొగనోవ్



అనువాదం: శ్రీ పి. శ్రీనివాసరావు

ప్రఖ్యాత సోవియట్ రాజకీయవేత్త మైకేల్ కాలినిన్ గొప్ప సాహిత్యాభిజ్ఞుడు. ఆయన సాహిత్యంమీది తన ఉత్తమ పరిజ్ఞానాన్ని అనేక వ్యాసాల ద్వారా, ఉపన్యాసాలద్వారా వ్యక్తపరిచాడు. జూన్ 1946 లో ఆయన మరణంతో, సోవియట్ రచయితలు ఒక ఆప్తమిత్రుణ్ణి, సహృదయ విమర్శకుణ్ణి, మార్గదర్శకుణ్ణి కోల్పోయారు.

వేర్ రాష్ట్రంలో వెర్ఖనాయయాత్రోయిట్సా అనే గ్రామంలో నివసించే ఒక పేదరైతు కుటుంబంలో జన్మించాడు కాలినిన్. (ఆ ప్రదేశం ఇప్పుడు కాలినిన్ ప్రాంతంగా పరిగణింపబడుతున్నది.) ఒక గుర్రం, ఒక ఆవు, ఒక మేక - ఇవీ కాలినిన్ తండ్రికున్న ఆస్తి, శిధిల దశలోవున్న పధ్నాలుగు చదరపు ఒడుగులపాకను ఆయన 36 రూబుల్సుకు కొన్నాడు. మైకేల్ కాలినిన్ బాల్యదశ ఆ గ్రామంలోనే గడిచింది. అక్కడే ఆయన విద్యాభ్యాసం-కొన్నాళ్లు ఒకమాజీ సోల్జరువద్దా, తర్వాత గ్రామ పాఠశాలలోను, ఆ పాఠశాలలో చదువు పూర్తవుతూనే ఆగ్రామంలోని బోల్టోవిస్కీ అనే రైతు కాలినిన్‌ను ఒక వార్తావహుడుగా తన వంశంలో చేర్చుకున్నాడు. తర్వాత 1889లో వాళ్ళిద్దరూ పీటర్స్‌బర్గ్ వెళ్లారు.

తన గ్రామంలో చదువుకొంటున్నప్పుడే, కాలినిన్ అత్యధికంగా పుస్తకాలు చదువుతూ, విశేష ప్రజ్ఞనూ, జిజ్ఞాసనూ ప్రదర్శించేవాడు. పీటర్స్‌బర్గ్ చేరాక, ఆయన జిజ్ఞాస ఇంకా ఇనుమడించింది. పుస్తకాలు, వార్తాపత్రికలు దీక్షగా చదివేవాడు.

తన అనుభవాలు వివరిస్తూ కాలినిన్ ఇలా అన్నాడు. "వార్తాపత్రికల్లోని రాజకీయాలు, విదేశాంగ వ్యవహారాలు అంటే నాకమితోత్సాహంగా ఉండేది. అయితే, నా చదువు ఒక క్రమంలో సాగిందికాదు. ఏ పుస్తకం దొరికితే ఆ పుస్తకం, మా యజమానుల లైబ్రరీలో ఏ పుస్తకాలుంటే అవి చదివేవాణ్ని. ఉత్తమ రష్యన్ గ్రంధాలన్నీ సొంతంగా చదివాననే చెప్పవచ్చు. అంతేగాకుండా బ్రాహ్మ్ రచించిన 'జంతువుల జీవితం' లాంటి శాస్త్ర గ్రంధాలు జాన్ స్టూవర్టు మిల్ పుస్తకాలు మొదలైనవన్నీ చదివాను. తత్వశాస్త్రమే కాకుండా, కేవలం సాహిత్యానికి సంబంధించిన రచనలుకూడా నేను చదివాను. ఈవిధంగా ఫ్యాక్టరీ పనిలో చేరేసరికి నాచదువు చెప్పుకోదగిన స్థితికి వచ్చింది."

1893 లో కాలినిన్ 'స్టారీఅర్సినల్'

అనే ఫ్యాక్టరీలో నెలకు 8 రూబుల్సు జీతంమీద పనిలో చేరాడు. ఈ వేత నంతో ఆయన జీవితావసరాలేవీ గడువ కున్నా, అందులోనే పత్రికలు కొన డానికి డబ్బు మిగిల్చేవాడు. అప్పుడే మొట్టమొదటిసారిగా రష్యన్ కార్మికుని యదార్ధపరిస్థితులను కాలినిన్ స్వయ ముగా తెలుసుకున్నాడు.

రెండుసంవత్సరాల తర్వాత కాలినిన్ పుటిలోవ్ కర్మాగారంలో చేరాడు. సాయంత్రం విరామ సమయాల్లో పాఠా లకు వెళుతూ, స్వయంగా విద్యాభ్యాసం చేస్తూ వచ్చాడు.

1917 లో, అంటే, అక్టోబరు విప్లవా నంతరం, ముందు పెట్రోగ్రాడ్ పట్టణం తరపున ఎన్నుకోబడడం, తర్వాత పెట్రోగ్రాడ్ మేయరుగా ఎన్నుకోబడడం జరిగాయి. 1919 మార్చిలో, లెనిన్ సలహా ప్రకారం, కాలినిన్‌ను రష్యన్ కేంద్రశాసనసభకు అధ్యక్షునిగా ఎన్ను కొన్నారు. ఇరవైయేడు సంవత్సరాలు కాలినిన్ సోవియట్ ప్రభుత్వంలోని అత్యున్నతశాఖలకు బాధ్యత వహించి పనిచేశాడు. ఇది శ్రామికుల రైతుల ఐక్యతకు నిదర్శనం. 1922 లో సోవి యట్ కేంద్రశాసనసభకు అధ్యక్షుడుగా ఎన్నుకోబడ్డాడు. నూతన రాజ్యాంగ పథకం అమలులోనికి వచ్చినపిదప జూన్ 1938 లో U. S. S. R, సుప్రీం సోవియట్‌కు అధ్యక్షుడుగా కూడా ఆయనే ఎన్నుకోబడ్డాడు.

ప్రొలిటేరియన్ విప్లవానంతరం రష్యన్ జాతీయ జీవనంలోని ఉత్తమ గుణాలన్నీ తనలో మూర్తీభవించు కున్నాడుకాలినిన్. అందువల్లనే నూతన రష్యాలోని ఆదర్శవ్యక్తుల్లో ఆయన కూడా ఒకడైనాడు; ప్రజల ప్రశంసలు పొందాడు.

కాలినిన్ మొట్టమొదటి రకం కార్మి కుడు. విద్యాభ్యాసం పాఠశాలల్లోకాదు. జార్ చెరసాలల్లోను, విప్లవ సంఘా ల్లోను, శ్రామిక ప్రజానీకాన్ని సంఘటిత పరచడంలోను, ప్రభుత్వ బాధ్యతల్ని నిర్వర్తించడంలో ఆర్జించిన అనుభవం వల్లను, కాలినిన్ అఖండ విద్యా పారం గతుడైనాడు. శ్రామిక వర్గంయొక్క చరిత్రాత్మక పాత్రను గురించిన మార్క్సిస్టు సూత్రాలను అమలు పరచడమే ఆయన జీవితంలోని ప్రత్యే కత. కాలినిన్ మార్క్సిస్టు సిద్ధాంతాల ననుసరించడమేకాక, శాస్త్రీయ సామ్య వాద విజ్ఞాన సమ్మిళితమైన రష్యన్ ప్రొలిటేరియట్ యొక్క అనుభవజ్ఞాన సంపదనంతటినీ తనలో ఇముడ్చు కొన్నాడు.

మార్క్సిస్టు అయినవాడు మంచి సంస్కృతి, పాండిత్యం కలిగివుండా లని కాలినిన్ అభిప్రాయం. ఆయనలో ఈరెండు లక్షణాలూ వున్నాయి. ఆయన విజ్ఞానం, అభిరుచి-వీటికి ఎల్లలులేవు. పరిశ్రమల నిర్వహణ, సమిష్టివ్యవ సాయం, తాత్వికచర్చలు, సౌందర్య పిపాస, సాహిత్యం, లలితకళలు-అన్నీ ఆయనకు కరతలామలకమే.

ప్రజానీకానికి కాలినిన్ నిజమైన ఉపాధ్యాయుడు. ప్రాథమిక పాఠశాలల నుంచి ఉన్నత విద్యా సంస్థలవరకు, ప్రజా విద్యకొరకు ఆయన చేసినసేవ

అమూల్య మైనది. ప్రాచీనమైనవే కాక, నేటి సాహిత్య గ్రంధాలంటే ఆయనకు అమితప్రీతి. వాటిలో కల్పనా చాతుర్యం ప్రతిఫలించడమేకాక, అవి అభ్యుదయంకోసం జరిగే పోరాటంలో ప్రబలమైన ఆయుధాలని ఆయనఉద్దేశం. ఆయన ప్రఖ్యాత సాహిత్య నిర్వచనం చూడండి — "ఒక యదార్థమైన కళా కారుడు తన రచనలద్వారా మానవ వివేచనాశక్తిని పెంపొందింపజేయాలి. ఈ ఆశయంతో రచనలు సాగించని రచయిత రాణించడు. ఆ విధంగానే ఈ ఆశయంలేని నటకుడు కూడా తన కళలో పరిపూర్ణుడు కాజాలడు."

వృత్తిద్వారా కాలినిన్ సాహిత్యవేత్త గానీ, విమర్శకుడుగానీ కాడు. ఆయన ప్రప్రధమంగా మంచి వివేచనాపరుడు. గొప్ప చదువరి - అని మరచిపోరాదు. కాలినిన్ సాహిత్యోపన్యాసాల్లో వాక్చాతుర్యంగానీ, అలంకారికమైన భాషగానీ, భావాతీతమైన భాషగానీ కనిపించదు. ఆయన భావాలు అందరికీ అర్ధమయ్యేలాగా వుంటాయి. ఆయన నిర్వచనాలన్నీ సూటిగా విషయాన్ని వివరించేవిగా వుంటాయి. ముఖ్యంగా వాడుకకు దూరమైనపదాలు ఆయనకు ఏ మాత్రం గిట్టవు.

"నాకు పద్యాలకంటె వచనమంటేనే ఇష్టం" అని ఒకసారి తన అభిరుచిని గురించి చెప్పుకున్నాడు. ఇక్కడ మరి కొంచెం చెప్పాలి. భావగాంభీర్యంలేని పెద్దపెద్ద పదాలన్నా, హానికరమైన విషయాల్ని మరుగుపరిచే సూక్తులన్నా ఆయనకు అసహ్యం. ప్రజానీకం దృష్టితోనే ఆయన సాహిత్యాన్ని సమీక్షించేవాడు. సాహిత్య మంటే ఆయనకు ఎంతో అభిమానం, ఆదరణ, సాహిత్యాన్నిగూర్చి మంచి ఆవేశంతో ఉపన్యసించేవాడు. కాలినిన్‌తో ముచ్చటించిన వివరాలు తెలియజేస్తూ, ఫ్యాడోర్‌గ్లాడ్‌కోవ్ ఇలా అన్నాడు. "ఆయన కెప్పుడూ సాహిత్యాన్ని గురించే ఆలోచన. చిన్నతనంనుంచీ సాహిత్యం ఆయన జీవితాన్ని పెనవేసుకొనిపోయింది. ఆయన కవితాత్మను కలిగివుండే వాడని నా అభిప్రాయం."

కల్లకపటాలు, భేషజాలు, అసహజమైనవిషయాలు, చూస్తే ఆయనకు చాలా అసహ్యం. ఇలాంటిలక్షణాలుగలరచనలు అంటేకళతో చెలగాటమాడే రచనలు సంఘానికి హానికరంకాబట్టి, అలాంటవీ; సామ్యవాద సంస్కృతికి మార్గంచూపక కేవలం కపట వేషధారుల్ని తృప్తిపరచడానికి ఉపకరించే అస్వాభావిక రచనలు- ఆయనకోపానికి గురిఅయ్యేవి. ఆయన జీవితంలోని ఉదాత్తత స్వచ్ఛత ఆయన కళాదృక్పథంలోకూడా వున్నాయి.

"కామ్రేడ్సు ! జీవిత ప్రమాణాన్ని మనంప్రధానంగా చూడగూడదు. ఇరవైనాలుగేళ్ల వరకే జీవించిన వాళ్లున్నారు. వందుముదుసళ్లూ ఉన్నారు. కొంతకాలం గడచాక అందరూ ఆముసలివాళ్లని మరచిపోతారు. కాని, ప్రజాశ్రేయస్సు కొరకు పాటుపడి మరణించిన ఆ ఇరవైనాలుగేళ్ళ యువకుల్ని మాత్రం ప్రజలు ఎన్నటికీ మరచిపోరు. ప్రజాశ్రేయస్సే తనశ్రేయస్సుగాభావించి, ప్రజానీకానికి శత్రువులైన వారిని తనశత్రువులుగా

ఎంచి, వారి సుఖదుఃఖాల్లో పాల్గొన్న వ్యక్తి ఇరవైయేళ్ళు జీవించినా, అతని జీవితం పరిపూర్ణమైనది. నూరేళ్ళు జీవించిన వాడికంటే అతని జీవితమే ఎన్నోరెట్లు సుఖవంతమని నిస్సందేహంగా చెప్పగలను." అన్నాడు కాలినిన్.

ఆయన నిరాడంబరజీవి. మాస్కోలో మొఖవాయా వీధిలోని ఆయన ఇంటికి ఎవరైనా ఎప్పుడైనా వెళ్ళవచ్చు. లక్షలాది ప్రజానీకం ఆయన్ను సందర్శించి ఆయన ప్రోత్సాహాన్నీ, సలహాలనూ పొందేవారు. అందుకే ప్రజలు ఆయనను 'సోవియట్ పెద్ద' అనేవారు.

ఆయన్ను చాలాసార్లు కలుసుకున్న గ్లాడ్‌కోవ్, ఆయన ఇంటి వాతావరణాన్ని గురించి చక్కగా చిత్రించాడు. "ఆయన దగ్గరకు వచ్చే వారంతా ఒక ఆంతరంగిక మిత్రునివద్ద పొందే స్వేచ్ఛానందాలు అనుభవించేవారు. ఆయన దుస్తులు చూస్తే ఒక ముసలి మాస్టరు గుర్తుకొచ్చేవాడు. మిలమిలలాడే కళ్ళతో, చిరునవ్వుతో, వచ్చిన వాళ్ళని తన కళ్ళద్దాల్లోంచి సాభిప్రాయంగా చూస్తూ, దగ్గరగా మాట్లాడేవారు. ఆయన దేహం కొద్దిగా వంగి వుండేది- వయసువల్లకాదు; నిరంతర ఆలోచనవల్లా, కార్యభారంవల్లా. ఆ నిర్మలత్వం, ఆదరణా చూచి, అతిథులు స్వతంత్రంగా దాపరికంలేకుండా వ్యవహరించేవారు."

ఒకనాటిసమావేశాన్ని గ్లాడ్‌కోవ్ ఎంత విపులంగా వర్ణించాడో చూడండి: "ఒకనాడు కాలినిన్ తీవ్రంగా ఆలోచిస్తూ, క్రెమ్లిన్‌నుంచి చకచకా నడచి వస్తున్నాడు. వేసుకున్న బట్టలు సాధారణంగా వున్నాయి. శరీరం వంగివుండటంవల్ల ఆ తెల్లని గడ్డంవచ్చి గుండెలు తాకుతూవుంటే, ఆ బక్క-పల్చటి వ్యక్తి చూపుకు ఆనకపోయినా, ఆముఖ లక్షణాలు ఎంత గంభీరంగా ఉన్నాయి! బాటసారులు ఆయన్ని చూచి ఆగి 'అడుగో మైకేల్ ఇవనోవిచ్, 'అడుగో చూడు కాలినిన్' అంటూ గుసగుసలాడుతున్నారు. అందరిచూపులు ఆయనమీద ప్రేమతో ప్రసరిస్తున్నాయి."

ఆయన ఇంటికి వెళ్ళేవాళ్ళల్లో ఎక్కువమంది సోవియట్ రచయితలు. గదిలో వెచ్చదనంకోసం ఆయనే నిప్పు చేసేవాడు. వచ్చిన రచయితలతో మనసిచ్చి దీర్ఘంగా సంభాషిస్తూండేవాడు. ముఖ్యంగా, ఫొదోర్ గ్లాడ్‌కోవ్, మైకేల్ షోలకోవ్‌లు ఆయనతో సంప్రదించిన విషయాలు చాలా వున్నాయి.

ఒక రచయితతో ముచ్చటిస్తూ, కాలినిన్ కళఅంటే తన అభిప్రాయం ఏమిటో చెప్పాడు: "కళ అంటే సత్యం. సత్యం ఒక్కటే సర్వ సమ్మతమైనది; అజేయమైనది. సత్యం కాని కళ ఎన్నటికీ కళ కాదు" అని.

ఆయన విమర్శించిన గ్రంథాల్లో ఆయనకుతోచిన ప్రధానదోషం ఏమంటే -"రచయితలు జీవితాన్ని సరీగా అర్థం చేసుకోక- అంతా కల్పిస్తారు" అనేది.

సోవియట్ సాహిత్యం ప్రజల్ని విద్యావంతుల్ని చేయడానికీ, వారి పురోగమనానికి తోడ్పడడానికీ ఉపయోగపడే మహత్తర సాధనమని కాలినిన్ ఎన్నో పర్యాయాలుఉద్ఘాటించాడు. ఒక రచయిత

తనకర్తవ్యం సాధించినప్పుడు సంతోషించడం. అలా సాధించలేని రచయితకు సహకారం ఇవ్వడం, ఆయనకు పరిపాటి. కాని మానవజీవితాన్ని సక్రమంగా చిత్రించని రచయితల్ని మాత్రం తీవ్రంగా నిరసించేవాడు. "పెద్దపెద్ద పుస్తకాలంటే నాకు తగని చికాకు. కాని చాలమంది రచయితల్లో లావాటి పుస్తకాలు తయారుచేయాలనే భ్రమకనిపిస్తున్నది రాసేది కొద్దిఅయినా, రాసిన దాంట్లో విలువవుంటే చాలని నా ఉద్దేశం. గంభీరమైన భావాన్ని వెలిబుచ్చడానికి అవసరమైన పదాలేవాడుతూ, సూటిగాను నిశితంగాను, విశదంగాను వ్రాయడమే ఉత్తమం ఈ విషయంలో చెకోవ్ సిద్ధహస్తుడు" అని అంటూండేవాడు కాలినిన్.

ప్రతిభావంతుడైన కళాకారుడు ఎన్నడూ ఎవ్వరినీ అనుకరించడు. "స్వతస్సిద్ధమైన భావాలే వెలిబుచ్చాలి. స్వతంత్రమార్గం అవలంబించి ముందంజ వేయాలి. ఇతరుల భావాల్ని ఎప్పుడూ స్వీకరించకూడదు కవిత్వంలోను, కళలోను జిత్తులూ కపటవేషాలూ వెయ్యడంకంటె హేయమైనవిషయం ఉండదు"

యదార్థమైన కళాలక్షణం-నిజాయితీ, ఉన్నత భావాలు ఉండడం. గేయకవిత్వమంటే ఏమిటిఅనే ప్రశ్నకు కాలినిన్ ఇలా సమాధానమిచ్చాడు: "అది ఆత్మయొక్క సంగీతం, హృదయంలోని పాట. ఆవేశంలోని ఔన్నత్యం. ఆత్మ ఆనందించేపుడుగానీ, బాధపడేపుడుగానీ మాయోపాయాలకు తావులేదు." ఇందుకుదాహరణంగా ప్రజాదరంచూరగొన్న రష్యన్ గేయాలను గురించి యిలా అన్నాడు: "రష్యన్ గేయాలువింటే మన హృదయాలెందుకు అంతగా స్పందిస్తాయి? ప్రజల సాధకబాధకాలు వారి సుఖదుఃఖాలు ఆపాటల్లో అంతర్లీనమై వుండడమే కారణం."

యువరచయితలను గురించి చెబుతూ "వాళ్ళ చూపులు నిశితమైనవి కాబట్టి, ప్రతి వస్తువులోను వాళ్ళకు కళ గోచరిస్తుంది. అయినా వాళ్ళకు జీవితాన్ని గురించి పరిపూర్ణజ్ఞానం, అనుభవం ఇంకా కలుగలేదు. నేటి సాహిత్యం కంటె జీవితం చాలా విలువైనది." అన్నాడు.

"మన జీవితం ఒక సముద్రం, సాహిత్యం ఈ సముద్రంలో ప్రయాణం చేసే ఒక నౌక.

"మనదేశంలో శ్రామికులు, రైతులు, శాస్త్రం, కళ-వీటిపట్ల చూపే ఆదరణకు కారణం, ప్రజలు మాత్రమే శాస్త్రానికీ కళకూ విలువకట్టి గలిగివుండడం.

"మనదేశంలో కళాకారుల ప్రతిభకు విలువకట్టేవారు ప్రజలు మాత్రమే. కళా ప్రయోజనం ప్రజాశ్రేయస్సేగనుక, మనకళ ప్రజా శ్రేయస్సుకే వినియోగపడుతుంది. మనప్రజలు సంగీతసభల్లో ప్రఖ్యాత గాయకుల గానం విని, చిత్రకారుల చిత్రాలను చూచి, తమ అభిప్రాయాలు వెలిబుచ్చుతారు. వారి అభిప్రాయాలు బూర్జువా ప్రజకట్టే విలువలకేమీ తగ్గవు. చేయి తిరిగిన కవులూ, పేరుపొందిన గాయకులూ అంతవారు కావడానికి కారణం—

ప్రజల కల్పనా చాతుర్యానికీ, ప్రజల కళాదృష్టికీ సన్నిహితులు కావడం మాత్రమే. శతాబ్దాలుగా ప్రజలు తమ పాటలూ, నృత్యాలూ సృష్టించుకొని, అందులో విలువైనవాటినే భద్రపరచి, వాటిని తీర్చిదిద్దారు. మానవుడి జీవిత ప్రమాణం చాలా అల్పమైనది కనుక, ఒకవ్యక్తిగాక, సమాజమే మన కళల్ని రక్షిస్తుంది; పెంపొందిస్తుందని చెప్పాలి, మన గొప్పగాయకులు ఏనాడో ఆలపించిన గీతాన్ని ఇప్పటికీ మనప్రజలు పాడుతున్నారు. ప్రస్తుతప్రపంచ పరిస్థితులవల్ల ప్రజలు తమకల్పనాశక్తినికోల్పోయారు. పూర్వపు రాజులు కళావేత్తలను నిర్లక్ష్యం చేస్తే, మనం ప్రోత్సహిస్తున్నాం. ఈ రోజుల్లో ఒక కళాకారుడు గొప్పవాడు కావాలంటే ముందుగా అతడు ప్రజాసీకానికి సన్నిహితుడుకావాలి. ప్రజల్ని మెప్పించలేని కళాకారుణ్ణి ఎవ్వరూ లక్ష్యం చేయరు. ఈరూపంగా మన ప్రజలకూ, కళలకూ సన్నిహిత సంబంధము నానాటికీ పెంపొందుతున్నది" అని కాలినిన్ ఒక ఉపన్యాసంలో అన్నాడు.

సోవియట్ సాహిత్యంలో "మానవుడికి గౌరవం ఆపాదించి, సోవియట్ పరిపాలనలో ప్రజలలో పెంపొందిన ఉత్తమ నైతికలక్షణాలను ప్రపంచంచేత గుర్తింపజేసే" అభ్యుదయరీతుల అవశ్యకతను లెనిన్ పదేపదే ఉద్ఘాటించాడు.

పూర్వకాలపు రష్యన్ సాహిత్యంలో క్రైస్తవ క్షమాగుణం. సమాధానం లాంటి లక్షణాలను మాత్రమే చూచే పాశ్చాత్య విమర్శకులకు ప్రత్యుత్తరమివ్వడానికా అన్నట్లున్నవి ఈవాక్యాలు.

"మన సారస్వత ఖ్యంతటిలోనూ మన కళావేత్తల రచనల్లోను దుష్టవ్యాసంగాలను నిరసించడం బలంగా కనిపిస్తుంది. ఇందువల్ల మానవజాతికి శత్రువులైన శక్తులతో పోరాడటానికి కళ బలమైన సాధనమవుతుంది."

ఈ లక్షణాలు-అంటేపోరాటతత్వం, వెన్ను చూపని సాహసం - నేటి సోవియట్ సాహిత్యంలో మరీగాఢంగా కనిపిస్తాయి. ఈ సందర్భంలో బోరిస్ గోర్బటోవ్‌యొక్క 'అజేయుడు' అనే నవలలోని 'టారాస్' అనే పాత్రలో ఈ లక్షణాలన్నీ గోచరిస్తాయని కాలినిన్ అభిప్రాయం.

ప్రజలపట్ల రచయిత బాధ్యత అపారంఅని కాలినిన్ యెన్నోసార్లు సూచించాడు. రైతు రచయితలు ఆయన్ను కలుసుకొన్నప్పుడు, "రచయిత తనకళలో సిద్ధహస్తుడై వుండాలి" అంటూ రచయిత బాధ్యతల్నిగురించి హెచ్చరించాడు, "నీవు నిజమైన కళారాధకుడివైతే పూర్వీకులనుంచి చాలా గ్రహించాలి. మానవజాతి సాధించిన సంస్కృతీ విజ్ఞానాల్లో వున్న ఔన్నత్యాన్నీ, ఉత్తమత్వాన్ని స్వీకరించాలి. అక్కడనుంచి నీనూతన గమ్యస్థానంవైపు నడవాలి."

సులభమైనశైలి, ఉచితమైనరీతి మాత్రమే గాక, రచయిత అనేవాడు తాను వ్రాయబూనుకొన్న విషయాన్ని అర్థం చేసుకోవడం, చాలాఅవసరం, "రచయితపరిశీలనా పటిమతో సందర్భశుద్ధిగల వస్తువునే ఎన్నుకోవాలి. ఒక

క్రమమైన తాత్విక రాజకీయ దృక్ప థంతో పరిశీలించడం వల్లనే ఇదిసాధ్య మవుతుంది."

మానసికంగా స్థిరత్వం లేనిరచయిత లకు సాంఘిక తాత్విక శాస్త్రపరిజ్ఞానం లేనిరచయితలకు- మార్క్స్, ఎంగిల్స్, లెనిన్, స్టాలిన్ల రచనలు చదవమని కాలినిన్ సలహాఇచ్చాడు. "యదార్థ మైన సోవియట్ రచయిత మార్క్సిస్టుగా వుండాలి." వాస్తవమైన, శాశ్వతమైన సాహిత్యం నెలకొల్ప బడాలని కాలి నిన్ సూచించాడు. "ఆరోజుల్లో సుప్ర సిద్ధుడై వుండిన పొలెపెంకో లాంటి రచయితలను మనంఆదర్శంగాగ్రహించ రాదు. పొలపెంకో రచన లేవీ నా కిప్పుడు జ్ఞప్తిలో లేవు. కాని ఆ రోజు ల్లోనే నేను చదివిన ఇతర రచయితల గ్రంధాలు నేనిప్పటికీ మరచిపోలేదు" అన్నాడు కాలినిన్.

19 వ శతాబ్దారంభంలోని రష్యన్ సాహిత్యంపై కాలినిన్ అభిప్రాయం చూడండి— "ఆ సాహిత్యం రష్యనుల రాజకీయ పరిజ్ఞానాన్ని పెంపొందించి, వారి వివేకాన్ని అభివృద్ధిపరచింది."

వివిధములైన రష్యన్ కళల గొప్ప తనానికి కారణం ఆయా కళలను ఉపా సించే మహామహులు ప్రజాభిరుచుల కనుగుణంగా వర్తించ గలగడమేనని కాలినిన్ ఉద్దేశం. రష్యన్ సాహిత్యంలో వుండే 'ప్రత్యేక జాతీయతే' సాహిత్యా నికీ ప్రజలకూగల బాంధవ్యానికి దారి తీసిందని ఆయన నమ్మకం రష్యన్ సంస్కృతి యొక్క అన్నిశాఖలకూ ఇదే సూత్రం ఆయన అన్వయించాడు. ఈ సందర్భంలో సంగీత విద్వాంసుడు ముస్సోర్గ్ స్కీ-తీ, చిత్రకారులు పెరోవ్, రెపిన్లనూ అభినందించాడు.

పూర్వకాలపు రష్యన్ కళలు - సాహిత్యం, చిత్రలేఖనం, సంగీతం - సంప్రదాయాలకు రష్యన్ సంస్కృ తిలో ఎంతో ప్రాముఖ్యం ఇవ్వబడు తుంది. స్వదేశకళలపై వుండే గ్రుడ్డి అభిమానం, విదేశకళలపై శత్రుభావం కాదు ఇందుకు కారణం. సోవియట్లో ప్రపంచంలోని ఉత్తమ కళఅంతా గౌర వింప బడుతుంది. ఇక రష్యన్ కళలు ప్రాముఖ్యం పొందడానికిగల కారణా లను కాలినిన్ ఇలా వివరించాడు : "మన సాహిత్యంలో నమ్మకంగా మన సాంఘిక జీవితం చిత్రించ బడుతుంది కాబట్టీ, ఆ సాహిత్యం ప్రజల్లో విప్లవ చైతన్యం కలిగించిందికాబట్టే అది ప్రజా సాహిత్య మయింది. బూర్జువా వర్గపు దుర్మార్గులను బట్టబయలు చేస్తూ, పీడితులైన నిరుపేదల భావి భాగ్యోద యానికి మార్గం చూపడమే ఆసాహిత్యం లోని గొప్పతనం."

సోవియట్ సామ్యవాద కళా దృక్ప థంలో ప్రజాసేవకు ప్రాముఖ్యం వుంది. సామ్యవాద వాస్తవికతను (Socialist reality) గురించి కాలినిన్ ఇలా వ్రాశాడు.

"ఒక వస్తువుయొక్క బాహ్యా స్వరూప వర్ణనేకాక, దాని అంతరార్థం కూడా సత్యమైవుండి, రచనలోరీతి, వస్తు ఐక్యతయే వాస్తవికత అని శతాబ్దం క్రితమే బెలిన్స్కీ- రచించాడు.

"బెలిన్స్కీ, అతని అనుచరులూ

మన కళా సాహిత్యాల అభ్యుదయానికి ఎంతో తోడ్పడ్డారు. రీతి, వస్తుఐక్యత సామ్యవాద వాస్తవికతకూ, బెలిన్‌స్కీ-వర్గంవారి వాస్తవికతకూ సమానధర్మమే కాని రెంటికీ భేదం వుంది.

పూర్వకాలపు రచయితలు కళాదృక్పధంలో సత్యాన్ని స్వీకరించడమే కాక, మానవజాతి జీవితాన్ని బాగుపరచాలనే ఆదర్శంతో సాంఘికసమస్యలనుపరిష్కరించేమార్గాన్నిఅన్వేషించేవారు ఈఅన్వేషణలో ఆ రచయితలు పూర్తిగా నెగ్గ లేకపోయినా, ఆనాటి దేశకాల పరిస్థితుల్ని విమర్శించ గలిగారు. కాని వారు ఉత్తమజీవిత చిత్రాలనుగానీ, ఉత్తమ పాత్రలనుగానీ సృష్టించడంలో విజయం పొందలేదు.

"మనదేశంలో సామ్యవాదం ఒక స్వప్నంకాదు. అది వాస్తవికత. ఈ సామ్యవాదాన్ని ప్రతిచిత్రకారుడు, రచయిత, నటకుడు, గాయకుడు, శిల్పి తన కళద్వారా వ్యక్తం చెయ్యాలి. సామ్యవాది వాస్తవికతను స్వచ్ఛంగా చిత్రించాలి" అన్నాడు కాలినిన్.

కళద్వారా వెలిబుచ్చబడేసత్యం, ఊహకందని అభూతకల్పనపై గాక, సామ్యవాద పోరాటంలోని అనుభవంపై ఆధారపడిన సాంఘికాదర్శం-ఈరెంటికలయికే సామ్యవాద వాస్తవికత, పూర్వకాలపు రచయితల్లో లేని ఈ స్పష్టమైన ఆదర్శాన్ని నవీనరచయితలు సాంఘికాభివృద్ధి సూత్రంద్వారా సాధించాలి. శ్రామిక వర్గపోరాటాన్ని పరిశీలించి చూసే ఈ సూత్రం మార్క్సు, ఎంగెల్సు, లెనిన్ స్టాలిన్ సిద్ధాంతాల్లో ఇమిడి వుందని మనం గ్రహించవచ్చు.

"ఏ సోవియట్ కళాకారుడైనా ప్రజలతో కలసి మెలసి, సామ్యవాదం నెలకొల్పడానికై జరిగే పోరాటంలో పాల్గొని నూతన ప్రపంచనిర్మాణంలో తనుకూడా ముఖ్యపాత్ర వహించాలంటే, సామ్యవాద జగత్తును స్థాపించే ఉన్నతాశయ సాధనలో ప్రజలకు తోడ్పడడం అతని ధర్మం" అని నిర్దేశించాడు కాలినిన్. ఈ ప్రకారంగా సామ్యవాద వాస్తవికతను అనుసరించే ప్రతికళాకారుడూ ప్రజలతో పాటు ముందంజ వేయాలనే ఉన్నతాదర్శంతో పనిచెయ్యాలి.

ఏ కళలోనైనాసరే, నూతన సాంఘిక వ్యవస్థమూలంగా ప్రజల్లో కలిగే క్రొత్త గుణాలు, ప్రపంచాన్ని గురించిన వారి క్రొత్తదృక్పధం వివరించబడితే, ఆ కళలో సామ్యవాద వాస్తవికత గోచరించ గలదు, యదార్ధమైన కళావేత్తకు తప్ప ఇవి యితరుల కంత సులభంగా కనిపించవు. సోవియట్‌పరిపాలనలోమార్పు చెందిన మనుష్యుల్ని గూర్చి కాలినిన్ చేసిన వర్ణన చూడండి— "మనదేశంలో సామ్యవాద సమాజఫలితంగా మానవుడు చాలా మార్పులుపొంది, కేవలం కొత్త వాడవుతున్నాడు. అతనికి అన్ని ఉత్తమ గుణాలూ అబ్బేటట్లు మనం చూడాలి."

సోవియట్ సంస్కృతికోసం పాటుపడే వారందరి బాధ్యతలూ చాలా గౌరవప్రదమైనవి. "సామ్యవాదాన్ని ప్రధమంగా స్థాపించినగౌరవం మనకే లభించింది. మానవజాతి శ్రేయస్సులో మనం సాధించిన ఈమహత్కార్యం మనసంతతి

వారు శాశ్వతంగా స్మరించుకుంటారు. ఇదేమనకు కొత్త ఉత్తేజం కలిగిస్తున్నది మీబోటికళారాధకులు అందరికంటె బాగా ఈసంగతిని అర్ధం చేసుకుంటారని అను కుంటాను " అని కాలినిన్ చిత్రకారుల నటకుల సమావేశంలో ఉపన్యసించాడు. ఆయన ఉపన్యాసాలూ, వ్యాసాలూ "సోవియట్ విద్యాధికుల బాధ్యతలు", "సోవియట్ సంస్కృతీ సమస్యలు" అనే గ్రంథాల్లో పొందుపరచ బడ్డాయి.

సాహిత్యంద్వారా ప్రజల్లో నైతిక బలం పెంపొందించాలని కాలినిన్ ఎల్లప్పుడూ చెబుతూ వచ్చాడు 1945 ప్రారంభంలో. అంటే యుద్ధం చివరి దశలో, ఆయన వ్రాసిన 'మన ప్రజల నైతికతత్వం' మీది వ్యాసాల్లో సాహిత్య విషయాలు చర్చించాడు. జర్మనీ ఓటమి తప్పదని అప్పటికే పొందనున్నదని ఆయన గుర్తించాడు సోవియట్ ప్రజలు విజయంలో నైతికశక్తియొక్క ప్రయో జనం అపారంగా వుంటుందనికూడా గమనించాడు

కాళినిన్ జీవితమంతా పరిజాపరితి విధిగానే గడిపాడు. సంఘంలోని వివిధ వర్గాల జీవితాలు, వాటివాటిప్రత్యేకతలు, అభిరుచులు సమగ్రంగా పరిశీలించి, అభ్యుదయ శక్తులతో ఎల్లప్పుడూ సహ కరిస్తూ, సాంఘిక దురాచారాలను ఎదు ర్కొంటూ, గంభీరమైె మాటల్లో దాచ బడే కపటాన్ని ఖండిస్తూ, జీవించిన రాజకీయ ధురంధరుడు కాలినిన్. ప్రజలతో కలసిమెలసి, అపార విజ్ఞా నాన్ని అనుభవాన్నిగడించి, దాన్ని ప్రజా శ్రేయస్సుకే వినియోగించి నిరంతరం కృషిచేసి విశేషకీర్తిగన్నవాడు కాలినిన్.

••••○••••

# ఏ రు వా క

ఏరువచ్చే కొత్త నాళ్ళలో
ఏరువాకే మొదటి పండుగ
నారు పొయ్యండోయ్—చేలకూ
నీరు పెట్టండోయ్
ఏరు వాకను చూడగానే
దుక్కిటెద్దులు పులకరించును
దుక్కి దున్నండోయ్—పొలాలు
చక్క చేయండోయ్
ఏరువాకను చూడగానె, నా
గేటి కొమ్మకు పూజసేయుదు
పంట హెచ్చేనోయ్—దేశాన
తిండి దొరికేనోయ్
ఏరువాకకు ప్రాణమిత్రుడు
ఏటి నీళ్ళకు నాయకుండూ
మేఘు డొస్తాడోయ్—మీకు
మేలు చేస్తాడోయ్
ఎండకాలపు తిప్పలన్నీ
ఏరువాకే వెళ్ళగొట్టును
భయము లేదోయీ—నీభూమి
కభయ మిస్తాడోయ్
ఏరువాకా వచ్చినాదీ
వెలుగు దారులు చూపినాదీ
ముందునడవండోయ్—పాడుతూ
చిందు వేయండోయ్
ఏరువాకా వచ్చినాదీ
ఏటి నీళ్ళను తెచ్చినాదీ
సాగు చేయండోయ్—పొలాలు
బాగు చేయండోయ్
ఏరువాకను గారవించుట
ఏటఏటా మరచి పోకుము
కరువు రాదోయీ—దేశాన
పరువు పోదోయీ

— విశ్వనాథ శ్రీకృష్ణరాయలు

Editor, Printer & Publisher C Pitchayya
Secretary, AndhraProgressive Writers' Association, Governorpet,
Printed at Prajasakti Press Bezwada Q H No K. 3 A